శ్రీ హయగ్రీవాయ నమః.



# చమత్కారమంజరి.

సింహాద్రి వెంకటాచార్యులచే

రచియింపబడి



శ్రీ భారతీవిలాస ముద్రాక్షరశాల
యందు ముద్రింపించి ప్రచురింపబడినది.

మొదటికూర్పు.

నర్సారావుపేట.

దీని వెల రు0-4-౬.

1911.

# ఉపోద్ఘాతము

—:(o):—

ఈగ్రంథకర్త శ్రీవైష్ణవుఁడు చెన్నకేశవాచార్యుల పౌత్రుఁడు తిరుమలాచార్యుల పుత్త్రుఁడు గౌతమగోత్రుఁడు "భద్రాచలస్వామి రామచంద్రుఁ డానర నాడెందమున నిండియుండుఁ గాత." అని భద్రాచలస్వామి నిష్టదైవతముగా స్తుతియించియుండుటచేత గోదావరిమండలములోని వాఁడైనఁగావచ్చును. ఈయన తనగ్రంథమును వైష్ణవమతోద్ధారకుఁడైన రామానుజాచార్యున కంకితము చేసెను. అప్పకవికిఁ బూర్వికులైన లాక్షణికులెవ్వరు నీయన గ్రంథమును బేర్కొనక పోవుటవలన నీయన 1630-40 సంవత్సరప్రాంతములయం దుండెనని యూహింపఁదగి యున్నది. అక్కడక్కడఁ గొన్ని వ్యాకరణ దోషములున్నను నీయన కవిత్వము ప్రౌఢముగా మాత్రమున్నది. ఈగ్రంథమును గందుకూరు వీరేశలింగము పంతులుగారు చింతామణీ ముద్రాక్షరశాలలో 1900 సంవత్సరమందు ముద్రింపించి యుండిరి. కాని యది నేఁ జూచియుండనిహేతువుచే మరలఁ బ్రచురించుట తటస్థమయ్యె. మాపత్త్రిక ప్రథమ సంపుటము ముగిసి ద్వితీయసంపుటమునఁ బ్రౌఢగ్రంథము లెవ్వియైనఁ బ్రచురించు తలంపుతోనుండ మాగ్రామమందలి పప్పుసీతారామశాస్త్రి తమపూర్వికులు వ్రాసియుంచిన యీచమత్కారమంజరి తాళపత్త్రములపైనుండ నాకొసంగెను. ఆప్రతి తప్పుల తడకగా నుండుటచే నేనెంతగా సంస్కరించినను దప్పులు పడక మానవయ్యె. ఇదియు నంగాక మాసమునకు ఫారమో? యరఫారమో? పత్త్రికలోఁ బ్రచురింపఁ బడుచుఁ దడవకొకరు ప్రూఫు చూచుచుండుటచేతమఱికొన్ని

పారప్రీతివహించియుండెన్ సుకవు లల్పస్వల్పసూ వద్యచ
స్సారస్యంబును జిత్తగింపుదు రజస్రస్వచ్ఛసంపూర్ణవాః
పూరార్థంబైన సముద్రుఁ డొల్లఁడె మదమ్మూర్తిన్ నదీనీరముల్॥ 5

తే॥ పలుకులయొప్పున మృదుపదవర్ణరీతిఁ గలితగీతుల నుత్తేభగతుల భావ
వచనమాధురిభూషణరుచుల నాదు కవిత నలరించు రసికుల గలికిబోటి 6

చ॥ రసికుఁడు గాని యర్థమధురంబగు కావ్యగభీరభూరివా
గ్విసర మెఱుంగ నేరఁ డవివేకి యొకానొక కారణంబునన్
వెసఁ జనిరాజగేహమున విగ్రహమౌ పంజరకీరిఁ జూచి తా
పిసనెలతిగ్గదూడయని పిల్చునుగొల్లఁడు జాతిభావతోన్ 7

ఉ॥ ఖ్యాతిగనన్యభుక్తివగుసద్ధమఁ గైకొనునాకవీంద్రులన్
జాతుడిమీరి నిట్టనుచు సన్నుతు లెన్నొనరింతు వారు క
ట్టా తెలియంగబుద్ధిని బిడాలసమానగుణాఢ్యు లెంచ వి
ఖ్యాతులితస్వభావు లగచుంగ సదా నవిశేషవృత్తులన్॥ 8

సీ॥ మిన్నందె నెందుపాలమున్నీటితరగలే తుంగుటుయ్యేలలు గానూగువాఁడు
గిరిఁ దరిఁజేసి యాశరధి వధించి సంధిలు సుధారసము సాధించువాఁడు
చెంచుకైదువ సమర్పించుఫలంబులు మించువేడుక నారగించువాఁడు
గద్దరియై పసిగాపుపెద్దలయిండ్లఁగలఁ గుక్రొవ్వెన్న ముచ్చిలినవాఁడు
గొనబుచిటిగొల్లెతలమోవిఁగ్రోలువాఁడు చేరిరసికతమీరంగఁ జిత్తగించు
నభినవాకల్పభావనాకల్పరుచిర మచ్చమత్కారమంజరీమధురిమములు 9

వ॥ ఇవ్విధంబున నిష్టదేవతావందనాదికావ్యముఖప్రసంగంబు సాంగంబు గానొనరించి 10

క॥ అక్షయకృష్ణబ్రహ్మక టాక్షోదతరసికపరిషదాహ్లాదకృతిసం
ధుక్షితనవనవకవనా దక్షుండ సింహాద్రివెంకటాఖ్యుండన్॥ 11

మ॥ వనజాక్షాంబుదజాయమానకరుణావర్షంబులం బుట్టు చే
తనసస్యాళికి దృష్టికుండలయి యాత్మఖ్యాతిసందోహముల్
దనర న్గోపురమంచ మెక్కి చరమార్థవ్యక్తియ న్నేకసే
చినశ్రీట్టితులదోలు మాయతిపతిన్ సేవించెదన్ వెండియున్ 12

ఉ॥ నంబెరుమాళ్ళచిత్తమొకనాఁడు ప్రసన్నతఁ జేసి యాత్మపా
దాంబుజదాసదాసులకు నందఱకిన్ ఘనమైన మోక్షసౌ
ఖ్యంబులభించఁ గాఁ బరముఁ గాంచిన మాయతిచంద్రుఁ బోల లో
కంబులలోఁ గలండె యుపకారుఁ డటంచుఁ దలంచి వేడ్క తోన్. 13

కం॥ భూసురనిజపదకిసలయ దాసమిన స్వామిశక్తి త్రితాపవిమూలో
ద్భాస్వకఫలకతాళం కాఞ్చనస్పృశకర త్రిదండి కాభరణునకున్ 14

కం॥ అక్షీణతటాకవిదిగ్ధ ఏ కుయని ప్రాకారణకవయాతిటనీసం
ధుకీతఫేనశ్రేణిస దృక్షుపళత్నో ద్భవపుంద్రదీప్తాన్యునకున్ 15

కం॥ దండప్రణామదానా ఖండానందాశ్రుసలిలకణగణలీలా
మండితపదనఖరోచి స్మాండలఖండితమన స్తమఃపటలునకున్

కం॥ ధృతిమతికి విబుధరచిత స్తుతితతికి నజన్యవాక్యచూడాఘువ్యా
కృతిరతికి దుర్మతమదాహతిన్ నతికిని లక్ష్మణార్యుఁ డగు యతిపతికిన్. 17

వ॥ అంకితంబైన కైంకర్యరూపంబుగా నారచియింపం బూనిన మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన

ఉ॥ ద్వారకయన్ పురీవరము దంచితకాంచనరత్నకీలిత
ద్వారకవాటమంశుకజవాతనిరుద్ధ నభశ్చరస్మరు
ద్వారకనద్ధ్వజవ్రజము ధర్మకృతస్సౌర పురీసురీతిభృ
ద్వారకలంకబింబమధివార్నిధిఁ జొప్పడియొప్పు నెప్పుడున్ 19

చం॥ తరమె నుతింపఁ బూనగను దప్పుట భేదనవాసిభాసి భూ
సురకులవర్యులెల్ల నతిచోద్యపవిత్రచరిత్రులెట్లనన్
సారదిని జాతువేదులను సూరులునయ్యు ననార్యశంకఁ బా
ల్చిరి జనలోకతోషకసుశీలగోవిధవాభిరామ్యముల్ 20

సీ॥ హారిపాకారి మహోనపనసుఁ డనలుం డాసౌరిప్రేతేశుఁ డా

శరదమూనాంబకశిష్యుఁడైతయు సరస్వన్నాయ కాండప్రఘం
దకయన్వాయపునాగభుస్నుఁడనఘైకావాపివిశేషుఁడా
మారుదుండాగురియొనెఖండపరకుండా నండ్రి తద్బాహుజుల్ 21

ఉ॥ వేలబడిన్ వణిగ్విపణివీథుల హాటకతారరాసు లా
ఖీలపతాకలన్ భిమరభృద్దురవస్థఘటించి యాత్మతు
ల్యాలఘుసౌధవీథికలయందుల డాగెమనంకురత్నత
త్రాళివిళత్సుమేరుగిరిశాద్రికిశోరములట్లు చెన్నగున్॥ 22

స్రగ్ధర

తమసంగీతప్రభేదోద్గతినదరుపయోదంబులాద్రెక్లి యేత
త్క్రమముం హృష్టేచరాలస్థములయిపడు ముక్తామణుల్ శూద్రపూర్ణం
దుమఖుల్ చేల్గాయుచుం బొందుగనొడిసెలలన్ రువ్వ శేషంబు తద్గ్రీ
తమునన్నిరై మడుల్పాత్తఁగఁ బొరిచెరుకుల్ తాను ముత్రెంబులీనున్ 23

వ॥ మగువత్తత్పురిహేమసౌధముల రిమ్యస్ఫారలీలావిధా
నగతిన్ దారలసాలభంజికలకన్వర్థంబుగాఁ జుక్కబొ
ట్టుగఁ బెట్టం బదనియ్యఁ బింఛిరసముత్తాన్నన్ నిశాజానిత
గ్గగనుండన్ హరిణాంకుఁడయ్యె హరిణాంకుండఁ ద్రువర్ణభ్రమన్ 24

చ॥ కలకుదేరుగండములు గండము లాశశిఖండలక్ష్మిక
త్యలఘుతరంగసంపదలకాపళ్ళు లావణ్యబు త్సలచ్ఛదో
జ్జ్వలతనుగోష్ఠు గోష్ఠు బిసవల్లిసముద్భవసౌకుమార్యకం
వళిములకద్భు జల్ భుజలు తత్పురికన్నెలచెన్ను లెన్నఁగాన్ 25

చ॥ హరిపురిపాలముంగెలిచి యాతతతజ్జయలక్ష్మిఁబూనికన్
బరిణాయమాదు నేననిశుభస్థితితోఁబొడవేగునంత ని
ర్భరగతితోఁజరించు ద్విజరాజుళశంబుసుజూచి హాచితా
నతఁగక యంతనిల్చినది యప్పురిగాటపుకోటయంతయున్ 26

క॥ పురమునఁ బోటుల్ మడుతే ర్వరచుచుఁ గొలనూలు నాఁగ బాటింతురు త
త్పరిసర పరిఘాంచలగత సరసీరుహనాళ మొకటి శక్యమె తలఁచన్॥

చ॥ లలిఁ బిగనప్పురింగల కొలంకులఁ గోకనదంబు లొప్పఁన 27
ల్లలనలకన్గవల్ తమవిలాసస్సమృద్ధికి నోడి భీతిచేఁ
జలమరికన్నమూయని ఝషప్రకరంబు లకుంబ్రసన్నవీ
క్షలదను సేయు తామ్రమయ స్థానపత్రికలొ నహాయనన్ 28

చ॥ అతులితతద్భుపీఁర్వన మయూరెభళీయునఁ గీరశారికా
మితకలకంఠషట్పదసమృద్ధతనొప్పె కురుండు కొఁబర
శ్శతలలితాస్త్రిముల్నిగుడ సారెనధోక్షజుఁ గెల్వఁ బూని యూ
తతముగఁ బెట్టు ముట్టడివిధంబునఁ దోచు పరీతసాలమై 29

క॥ ఉచ్చైశ్శ్రవమగుతనపై విచ్చలవిడి నెక్కరాతు వృద్ధశ్రవుఁడై
హెచ్చైన వేల్పుతేజిని గచ్చుకొని హసించు వీటఁగల్గు హయంబుల్ 30

సీ॥ వరకరంబుల సురవాహినిలోనున్న కుముదోరుపుండరీకములనొంచి
తతదీప్తి జితపుష్పదంతంబులై మీరి సాంజననిజవిగ్రహాతఁ జెలంగి
వాసిమీరఁగ మహావామనసుప్రతీకస్ఫూర్తిమించి నిక్కముగ నెసఁగి
యభ్రముపరమూర్తి నతిశయించుచు సార్వభౌమస్తుతంబులై పరిఢవిల్లి
యుండు మెండుగ శ్రీఖండమండితోరు గండమదగంధ బంధురకర్ణపవన

దత్తసురఘర్మజలశూన్యతాకధాప్రచారణములైన యవ్వీటివారణములు॥ 31

సీ॥ బలుబూటకఁపుతల్లి ప్రాణంబులుగ్గుగా నెమ్మితోఁ జిటిబొజ్జనిండ ద్రావి
పసి తపాతమాఁ బెట్టెను నరెడు కార్చిచ్చుఁ గారంపుమందుగా నారగించి
వీచిత న్నగగొట్టు వెక్కసంబగునుడి గాలిరక్కసు మీదఁ లాలియూఁచి
కాళీయుండను చల్లగాలి మేతల రేని ఘనశిరంబునఁ గుప్పిగంతులురికి
యొనరు గోవర్ధనంబను నొక్క కొండ । బంతిగా నాడి యిబ్భంగి బాలలీల
లక్కజంబుగ సలిపినయట్టిదిట్ట । దేవకీసూనుఁడఁ ప్పురతిలక మేలు॥ 32

సీ॥ ఆరయ నతులన వారిజాతోరుగర్వనివారకాస్యాభిరాముఁ డితఁడు
వాసి నెన్న సదావిలాసదృక్పరజాతవిజితానిమిష లోకవిభుఁ డితండు
పరికింప భ్రూలతాభంగవిస్ఫూర్తి నిరస్తాతనుమహాశరాసుఁ డితఁడు
కనఁగఁ దారకజిత్ప్రకాశసంపన్న ఖరప్రభా పుండు పేర్పడఁగ నితఁ

డవుచుఁ బండితు లశ్రాంతమును సుధానగోత్రచిత్రపవిత్రవాగ్గుంభనముల
నాత్మసౌందర్యశౌర్యంబు లభినుతింపఁ దనరె యాదవకులధురంధరుఁ డతండు॥ 33

కం॥ సరసిజ శశి శిశిర శర చ్ఛరద శరము లోడెఁ బద్యాశమునకు ధైర్య
స్ఫురణకు నవియే యోడెను హరసుతమగు తేజమునకు నవియే యోడెన్ 34

తే॥ చిత్రకూటప్రకారమై చెలఁగుకతనఁ బురము రామాభిరామమై పరగుచుండుఁ
జిత్రకూటప్రకారుఁడై చెలఁగుకతన హరియు రామాభిరాముఁడై యతిశయిల్లు॥ 35

వ॥ అంత

శా॥ నిద్రాళూకృతసారసజాలకము తన్నీరోరుధారామిళ
ద్భద్రశ్రీపరిలేపనిందనము విస్ఫారోష్ణ నాట్యక్రియా
ముద్రాదేశిక మంబుసంప్లవకథామాత్రప్రవాహంబు కుం
భద్రామాపటుమానభంజనము హేమంతంబు గానంబడెన్॥ 37

స్రా॥ శీతోపద్రవసంకటప్రభవ శోచిష్కేశమాలక్ష్యయా
పాతాశంకఁ గలంగి విస్తృతిలు పంబారంగ లోకంబు దా
భీతప్రక్రియఁ గప్పిపోచుగతి నొప్పెన్ ధూమరేఖోత్కరా
తీతాంగారకదంబపూరిత హసంతీ న్యస్తహస్తాబ్జమై 38

చ॥ అల నిజభూరివారము లాయారముతో మధుపాళికిచ్చి యో
రల ద్విజరాజు మెల్లనెకరంబులు సాచిన మోముగంది యా
కులతఁ జెలంగు పద్మినులకున్ సిరులెంతయు దూరమయ్యె భూ
స్థలిని నపాత్రదాతలకు శాశ్వతమే రమణీయసంపదల్ 39

చ॥ అరసికోలంకులందు జలజావళిఁ గానక తద్గవేషణా
పరతఁ జరించుచున్ విపులపంకజకోరకసారశంకచేఁ
బరువడి నేగుదెంచిన ప్రభాకరు భానునికదంబకంబనా
గురుకుచసీమలందపుడు కుంకుమగంధ మలందిరంగనల్॥ 40

కం॥ చెలువగుజనహస్తంబుల వెలువడి యొకచోటఁ దాళవృంతము లుండెన్
వలువగుసుడిగముఁ జేసిన యలయికసుఖనిద్రలొందు నందము మీరన్॥ 41

వ॥ అప్పుడు హరి హరిణాక్షులుం దానును యథోచితక్రీడాలోలుండై యుండె మహోత్సవంబున

ఉ॥ అంతటఁ బండివచ్చుపసనైనదళంబులు రాలెఁ దవ్వన
ప్రాంతములన్ ఫలంబిడుసమర్థతతో మధుమాసలక్ష్మిదా
నెంతయు వేడ్కరా నలమహీరుహదేవత పచ్చపట్టులన్
వింతలుగాఁ బదంబులకు వేగముతో మడఁగెచ్చురంగునన్॥ 43

మ॥ చెలువారంగఁ బలాశభూజములు బూచెన్ మానవౌఘంబుత
త్కళికారాజికిఁ జిల్కముక్కుల కభిఖ్యాతారతమ్యక్రమం
బులు చర్చింపుచుఁ జిల్కలెంతయునఁదన్మూలంబుగాఁ బొంకమై
పొలుపొందెన్ ధరఁ గింశుకంబులనఁ దద్భూజంబులన్వర్థతన్॥ 44

తే॥ పత్రపుష్పఫలరససంపదలు వేడె ధరణి నస్మాకపుఁడు ఘనతరుల నెల్లఁ
బత్రపుష్పఫలరససంపదలొసంగె ధరణి నస్మాకపుఁడు ఘనతరుల కెల్ల॥ 45

తే॥ పరఁగ విటపాళిఁ గూడియు బహుపలాశ మయ్యు నెంతయుఁ బరకోశవారియయ్యు
భూజసంఘంబు సుమనోవిభుత్వమంది నహహ మాధవసేవ నిరర్థకమగునె॥ 46

సీ॥ ఘనతరాగాప్తిఁ గని సారదాభిఖ్యనడరించు విమలగాత్రాళులకును
శ్రుతియోగ్యవాగ్వైఖరులఁ జెలఁగు సుసరసవనప్రియద్విజసంఘమునకు
మెప్పైనపరసాలవృధులతాబద్ధతిఁ దవిలిపక్కడు నా శుకవితతులకు
మహిమప్రవాలోకమంజులాస్యస్ఫూర్తిఁ గలయు వనాటులగణములకును
సంచడిలు వేడుకబలుమాకందవాహములు। తదాహరి భూరిసముజ్జ్వలప్ర
వాళము లభీష్టఫలములు నోలినొసఁగు నావసంతంబు రతిరాజుకీవి నెసఁగె। 47

కం॥ ఈరీతి వసంతము నిజ। చారుతరవిజృంభణములు సలుపఁగ మతిమం
దారామసహోదరునకు। నారామవిహారవాంఛ యపుడుదయించెన్॥ 48

తే॥ మంజుమాకందమంజరీపుంజచర్వ। ణక్రియాకుంఠకలకంఠనాదసరణి
నాలకించిన మరుఁడంతరంగరంగ। వసుధఁ జెలరేగి పేరెలువారికన్నె॥ 49

కం॥ నందకుమారుండపుడా। నందరసోద్వేలతరమనస్కుండగుచున్
బొందుగఁ దన దేవేరుల। నందరఁ జను దెమ్మటంచు నానతియిచ్చెన్॥ 50

వ॥ అప్పుడు

సీ॥ పరమేష్ఠివాణియుఁ సౌభాగ్యవర్ణాకృతి చొక్కమైనొప్పలఁ బేర్చుక్క చెళక
గబ్బిచన్నక్కవల్గరచినసుకుమారవిసములునా నరుల్ బిత్తరింపఁ
జిదరఁగాఁ జేరినచిరినవ్వుజిగియునా మురవైనముక్కరముత్తెమమరఁ

దను హేమవల్లికిం దాల్చిననీలంపు సెలగోలనా వేణి చెల్వమీఱ
నొక్క కెంగేలఁ బాపడఁ జక్కనిడుచుఁ దనరు మంజీరఘులుఘులుధ్వనికిం దగ్గాసె
ప్రతిపదంబున గడునుల్కపడుచు నేగు దెంచె రుక్మిణియను సుదతీలలామ 51

కం॥ చొక్కంపు నడతోం దళుకుం। బుక్కాఘుమఘుమలు తట్టుపునుఁగుభుగభుల్ నల్
దిక్కులు నిండఁగ నెంతయుఁ। జక్కని కాళిందియనెడు జవ్వని వచ్చెన్॥ 52

చం॥ గమకంపు టొరగొప్పు సిరిగందంపుఁ బొట్టును ముక్కు కమ్మ ము
త్తెము మెసగందమును బంగి నీలివల చీరెయు వీడెముల్ విలా
సముఁ దుళికించు కుందనంపు సందిటి తాయతు లొప్ప సత్యనా
నమరెడు ప్రోడ వచ్చె నరయన్ మెరయించుచు గిల్కుమట్టియల్ 53

సీ॥ జారుగొప్పున నున్న సంపెంగవిరులు లోఁగడసిన ఖద్యోతగణముఁ బోల
నుదుటఁ జన్నులబుటంబురుకునీలంపు తాళి గిరులపై జలదాళి క్రియ నెసంగ
సన్నవల్లెము మేన జాఱువాయనఁటి లేచిగురాకుపై మంచు వగల నించఁ
గనకభూమధ్యస్థకస్తూరి రేఖ సింగిణి ఘటించిన కోల గేలి సేయఁ
జేతి చిల్కకు మాటలు చెప్పుకొనుచు ఘల్లుఘల్లను నిజపాదుకారవమునఁ
గుంజరంబులఁ జప్పటల్ గొట్టు నడల తోడ నేతెంచె భద్రాఖ్య తోయజాక్షి॥ 54

సీ॥ నీలంబులైన పెన్నెరులజొంపము నుచితముగా సువర్ణయుక్తముగఁ జేసె
కంసారిచేపట్టుగల్గి ముక్తాఫలంబైన చన్గవఁ జంద్రమలరఁ గూర్చి
యలపుష్యరాగంబు లగుపాదనఖముల వరకర్బురార్తితో వరలనిల్పి
పద్మరాగంబులౌ పాదతలంబులఁ దగినకళ్యాణపత్రములఁ బొదివి
జంభవిధ్వంసిమణిమయస్తంభజనిత తిమిర మీషద్వికసితచంద్రికఁ దొరంగ
నప్పుడేతెంచె మిత్రవిందాఖ్య నీలవేణి లీలానమితస్వార్ణపాణియగుచు 55

మ॥ చెలువై జాంబవతీవధూటి చనుదెంచెన్ వేడ్కతో నప్పుడు
జ్వలమంజీరరాగంబు మంజుతరఘోషంబౌట గోపాలుఁడ
త్యలఘుప్రీతి వహించకున్నె గతశత్రుక్షీవడంబౌట చే
నలకాశేయము చక్రి యున్నతనిజస్వాంతుండు గాకుండునే॥ 56

ఉ॥ ముక్కరముత్యమున్ మిగుల మోహముఁ జొక్కముగూడి వక్త్రమున్
రిక్కలరేడు గాంచి సవరించిన నామముఁ బుద్దుకుర్రికున్
జొక్కపు బాహువులన్ బసిడిసోగలఁ గట్టిన లాలిలీలతో
నక్కనవ్రేలు దాళి చెలువారగ వచ్చె సుదంతి యంతటన్॥ 57

కం॥ విజితాభ్రము లల కౌనులు విజితాభ్రము లల్ల కుచులు వివరింపంగా
విజితాభ్రము లల నాభులు విజితాభ్రము లల్ల నడలు విమలాంగులకున్॥ ౫౮

సీ॥ అలకల్జడలెపోలుటకిదియె యూరులు రమణీయనాగోత్కరములఁ బోలు
నల యూరులేపోలుటకిదియె తన్నఖపాళియు శుభకరభములఁబోలు
నల ఖంబులేపోలుటకిదియె కంఠసీమలుచూడఁ దారకంబులనుబోలు
నల కంఠములెపోలుటకిదియె తనువల్లికలును గల్యాణపూగములఁబోలు
నట్టితనువులెపోలు లేమరిదితలప గలికిచూపులు చంచలాళులనుబోలు
నట్టిచూపులెపోలు లేమరిది మోము లతనుశరజాతములఁబోలునద్భుతముగ 59

సీ॥ శ్రుత్యంతపరిచితిశోభిల్లె నేత్రంబు లాగమాభ్యాసతనమరెఁగుచము
లనఘపురాణవాసనఁజెందెమధ్యముల్ ఘనకల్పరీతులఁగాంచెఁగురులు
ధర్మశాస్త్రస్థితిఁదనరె భ్రూదృష్టులు జ్యోతిషస్ఫూర్తితోనమరెనఖము
లమర్చఁబాటలవర్ణమంకించెమోవులు కవితాపరిస్ఫూర్తిఁగనియెనడక
లలమహాహీనశయ్యాంకుడైనయట్టి హరి సదాగూఢపదభూషుఁడైనహరుఁడు
స్నానపాకతఁజెలఁగువాగ్జాని యట్టి కమలనయనలవర్ణించఁగలరెతలప 60

వ॥ అట్టిమహిషీవర్గంబు పరశ్శతపరిచారిణీపరివృతంబై పురోభాగంబుననిల్చిన

చ॥ బొమలెగవైచి కన్గవలఁబొందుగఁగన్గొని పేరుగ్రుచ్చి కొం
చెముగహసించి యొక్కయొకసెక్కెమటాడి యయారె నీకు గం
దము కడునందవానినిముదంబునఁజెక్కిలిఁగీటి యిట్లు నె
య్యమెసఁగఁబల్కరించె హరిణాక్షులనందరనన్నిభంగులన్ 62

వ॥ అంతటఁ దత్సతీసహితుండై గృహారామాభిరామమార్గంబునం జనిచని 63

మ॥ సరసీజాక్షుఁడుగాంచెనంత నిఖిలాశాదత్తధూతప్రసూ
నరజశ్చిత్రితశాటికన్ నవఫలాంధఃప్రీణితోద్బుద్ధ హే
షరమానందనఘోటికన్ దరుశిఖాస్ఫాయద్ఘనేందిందిరో
త్కరదంభ్రాంబుదదర్శనప్రమదనృత్యత్కేకినీనాటికన్
సరసాపాదితమారధాటికను దచ్చంచద్వనీవాటికన్ 64

లయగ్రాహి.

మూలములరంగువిటపాళులబెడంగును బ్రవాళములయొప్పు ఛదజాలములతీరున్

గ్రాలుపసక్రొమ్మిగడఁడాలు పువుగుత్తులపిసాళిబిగి కుప్పలుగరాలినరజం బా
వాలములునిండిబయలొలిఁజను తేనియల కాలువలఁదెప్పలుగఁదేలెడుఫలంబుల్
చాలనటుకాంచి యలబాలికలఁగూడి వనమాలియు నయారెయని సోలితలయూఁచెన్

వ॥ మరియు నిష్కుటంబయ్యును సకుటంబై శుకపికనికరంబుల కవనంబయిన వనంబునందు ననూనంబులయిన సూనంబులనుద్భవించి యనాశాస్యంబయ్యునాశాస్యం బయిన మధురసంబుఁగ్రోలి పరవశతావిర్భావంబులయ్యు నపరవశతా విర్భావంబులై మెదలకయున్న తుమ్మెదకదుపుల పజ్జకుంజని యఘనాభిఖ్యంబులయ్యు ఘనాభిఖ్యం బులయిన శౌరియంగంబుల యొప్పిదము సెప్పలిడక తప్పకచూచు వనలక్ష్మిచూపుల రూపులనొప్పె భళిరెయని సావధానంబుగాఁగనుచును గనకరంభాస్తంభంబులకు నేగి యంతంబులయ్యు ననంతంబులై నపత్రంబుల విలాసార్థంబుగాదారుచును దారకకాం తిగల్గి ఖరంబులయ్యు నఖరశబ్దాభిధేయంబులై ననఖంబుల గండమండలస్వేదబిందుబృందం బులఁజిమ్మి వేసరిగంధవహాకందళంబులఁగోరుచును గోరకగణంబులు ప్రతిచ్ఛదమూలంబు నుబిక్కటిలినమల్లికానల్లికామతల్లికలఁగాంచి వలక్షంబులయ్యు నవలక్షంబులయ్యె నౌరయక్కజపుఁజక్కఁదనమనుచును నవకవసతినున్నకతనవసుధైకమధురంబులయ్యు నవసుధైకమధురంబులై న కీరకలాపంబులయాలాపంబులుగానరయుచును నరయకగతి నవలంబించిసంచరించె నచ్చంచలనయనాసంఘంబు మరియును. 66

## రగడ

లలివిరులకుబోరెడుతరెఁ గుచలోలతలఁజిక్కుచు లతలంజిక్కుచు
వలిగొనుపూదేనియజీరుకున జవమ్ములుదక్కుచు వమ్ములుదక్కుచుఁ
దగునొసలంగలచిరుచెమట నిరంతరముగనూర్చుచుఁ దరముగనూర్చుచుఁ
దగిలెడుతేటికిజంకుచెలిని వింతగనూరార్చుచుఁదగనూరార్చుచు
డాగుడుమూతలచుల్లసములు జగడంబుగనాడుచు డంబుగనాడుచుఁ
గాగుచుఁదమిఁగొనువికసితకుసుమ నికాయమువాడుచుఁ గాయమువాడుచు
రమణవసంతములాడినకుసుమ పరాగముఁబెంపుచు రాగముఁబెంపుచుఁ
దమతమయలరులఁబొత్తైనసిన సుందరులకుఁబంపుచుఁ దరులకుఁబంపుచు
నలులంటెలబెదరిన ముఖరాజీవాదులవాగుచు వాదులవాగుచుఁ
దులకించినకెమ్మలతో లలితగతులకుందూగుచుఁదులకుందూగుచు
రమణీయతఁగేదగిరేకుల నఖరమణులఁజీరుచు రమణులఁజీరుచుఁ
దమిముఖవాసనలం దుమ్మెదబిత్తరులందూరుచుఁ దరులందూరుచు

జడఁజూపియుఁదాపాగ్నిని మధుపవిసరములవేఁబ్బుచు సరములవేఁబ్బుచుఁ
గడుదళసరికర్పూరము హస్తయుగళములఁదాల్చుచు గళములఁదాల్చుచు
సిరులుపహించిరిసతులు ఫలభ్రాజితసురసాలన్ జితసురసాలన్
సరసద్యుతిశతశతహసిత దురాసదనవలీలన్ సదనవలీలన్ 67

ఉ॥ నారియొకర్తు చొక్కపు ననల్గల చక్కని చిన్నిపొన్నకున్
జేరి ప్రసూనగుచ్ఛము లశేషముఁగోసియు గ్రేశనొర్తు నీ
భూరుహమెక్కమన్న నగి పూయఁగఁజేయుదు నాకదెంత య
మ్మేరువుగాదు కాదిది నమేరువనందగిపూచెఁగ్రమ్మరన్ 68

తే॥ వారిజాక్షులు సరసభ్భావంబులయిన యరుణతరుణాత్మ పంచశాఖాంచలముల
నంటఁ బ్రౌయఃపరిస్ఫూర్తినమరు చూత వాటి సుమభూరిమహితమైవరలకున్నె

చ॥ ధరణితలంబునందుఁ గలదా సవతొక్కటినాదునాస కీ
వరుద్ఘుమటన్నఁ గేరి యొకయంగనయొత్తెమొగంబు సాటి యి
త్తరి మరియొక్కటీశతశతంబులఁ జూపెదన న్నయట్లుగా
నరిదిఘుటిల్లఁగోరకితమయ్యెదళంబుగఁ జంపకౌఘమున్ 70

ఆ॥ కొమ్మలురికితన్నఁ గొంచకపైఁబడ నుమియ వకుళవంజాళములకప్పు
డలమబాగతోచె నహహ లోకోత్తర తరులకిదియ నీతిసరణిగాదె 71

ఉ॥ దీనిప్రసూన మమ్మరునితీవ్రఁపుటమ్మయి పాంధగేహినీ
మానమడంచు నన్న గతిమానినియొక్కతెతన్నె నంతటన్
గానగనొప్పె నేతదురుఘాత ముఖస్రవదశ్రుధారలై
సూనగుళుచ్ఛసంఘము లశోకమహీరుహమాళిపాళికిన్ 72

తే॥ ధవళనయనలపాదఘాతములయందు వదలదుత్కంఠికాశ్రీలవంజాళంబు
దానికినశోకమనుబిరుదంపుపేరు మిగులఁజెల్లదెయకట ముజ్జగములందు 73

చ॥ వడినిడెఁజాటు మోమునకు వాతసముద్ధతమైన కెంపు పు
ప్పొడితెరలెండలంచు జలపోతసురంటియొకర్తు మించుసొం
పడరఁగనట్టినీరజచయంబులుగోయకుమంచు నెంతయున్
జిడిముడిపాటుతో మనవిఁజెప్పఁగవచ్చినసూర్యుఁడోయనన్ 74

చ॥ ఉడుగక యిద్దరొక్కననకోరడిఁబోరఁగనొర్తువారితో
వెడదరదంబులుండియును వెన్నెలదప్పమొసంగ డేమియున్

గడునొకయంత్రదారియని గాటఁప్రణీతధవిష్వదానికీ
బడుననవిప్పి నత్తరిని బన్నపహన్నోర్తు లబ్బించెనూనముల్ 75

వ॥ అంత

సీ॥ పూఁదేనెఁజిలికి కెంబుప్పొడి మేపించి చుక్కబొట్టుగదిద్దనొక్కచెలికి
గన్నెగేదఁగిరేకుసన్నగిలఁగఁజీరి యొగి దీగెగాఁ బెట్టెనొక్కచెలికి
గొనపైనకనకంపుటనటిరేఁజిగురుటాకొరపుపయ్యెదఁజేసెనొక్కచెలికి
స్థలపద్మముకుళంబుసరసంపుకుప్పెగాఁజొక్కంపు నెరిఁగ్రుచ్చెనొక్కచెలికి
బొన్నపూమొగ్గముత్తియంపుంమిటారి ముక్కరగఁదీర్చి నేర్పెనొక్కచెలికిఁ
నపుడు కేళీవిలోలాంతరంగుఁడైన వారిజాక్షుండు శృంగారవనమునందు॥ 77

వ॥ అంత.

సీ॥ మునుకొని సర్వతోముఖభంగమయ్యును ఘనతరామోదంబుగలుగుదాని
సరసిచూడ జడాశయంబయ్యు సంతతహంససేవనమునవమరుదాని
శ్రీమదాపూరితజీవనంబయ్యును నీరజస్థితిని రాణించుదాని
నతులనదీనభావాశ్రయంబయ్యును శక్రేశ్వరస్ఫూర్తి జరుగుదాని
నొక్కకమలాకరముఁగాంచి యువిదలెల్ల నక్కజమటంచు నామురహరునిగూడి
యుచితవేషంబు లుధరించి యోలలాడ దొడఁగిరతిసంభ్రమమునఁ దత్తోయములను 79

మ॥ సరసీజాళిగతాళిసంఘము నిజేచ్ఛన్వారి నెమ్మోము తా
మరలంజేరినుగంధలోభమెఁదగ్రమ్మన్ ఝంకరించెన్ మనో
హరనాదంబున నంతఁదన్ముఖవిరోధాంధోళితాంభోరుహో
త్కరదూత్యంబుభజించి సామములువక్కాణించుచందంబునన్ 80

సీ॥ నీటిలోపలఁ దననీడఁజూచి దెనీరుపాపయోయని యుల్కిపడియెనొకతె
యదెయిదెకొట్టుదమంచుఁ జెంగటనున్న పద్మనాళముఁ గేలఁబట్టెనొకతె
జంకకుమని హస్తకంకణంబులు బిట్టుమొరయ నచ్చెలివీపుఁజరచెనొకతె
పొలుపొంద వెలిదమ్మిపుప్పొడిమంత్రించి వెరవిభూతిగఁ బెట్టె వెలదియొకతె
వాసిఁ దెలిరేకుమూకటుఁ గేసరాన్న పుంజమపుడు బడిమిఁద్రిప్పి పోసెనొకతె
ప్రేమనీకాళియద్వేషి పేరనుడువ మెలగునేయిట్టిభయమంచుఁ బలికెనొకతె 81

ఉ॥ చిమ్మనగ్రోవిఁబూని సరసీరుహనేత్రుఁడునీరుఁజిమ్మగాఁ

గొమ్మయొక్కర్తు వక్త్రమునకుంబడకుండఁగఁబట్టెఁబాణి భా
గమ్ములు దన్నఖంబులునుఁగన్పడెఁజుక్కలు చెందొవల్ తదా
స్యమ్మనుచంద్రబింబమున కడ్డమువచ్చినభంగి నెంతయున్ 82

శా॥ లీలంజిమ్మనగ్రోవిఁదాల్చి చెలి యాలీఢస్థితిన్ నిల్చియు
న్కీలాలంబెగఁజిమ్మఁ బొంకమయివీక్షింపందగెం బత్పయో
జాలం బచ్చెలిహస్తపల్లవము లబ్జాతంబులంగెల్చి యో
పాలోకంబునుతింపనిల్పిన జయస్తంభంబుచందంబునన్ 83

తే॥ ఒకతె మొగమునజతగూడియువిదమీఁద ¦ నీరుఁజల్లంగనపుడురాణించెవారి
కరములేతెంచునాసుధాకరునకర్ఘ్య ¦ పాద్యములొసంగుచెంగల్వబారులనఁగ 84

తే॥ ఇట్లునీరాడిహరియోఁ బూర్ణేందుముఖులు నార్ద్రవస్త్రంబులూడ్చిదివ్యాంబరములు
దాల్చి తొడవులు బెట్టి చందనమలంది కురులుతడియారవిడచి క్రొవ్విరులుముడిచి

చ॥ ఒనరఁగనంతఁగన్నెలపు డొండొరుచొక్కపుఁజెక్కుటద్దముల్
గనుగొని కుంకుమంబుఁదిలకంబుగదిద్దిరి కేరిపుష్పాడుల్
నవలఁబొసంగుకప్రపుటనంటిరివల్గొనిపూవుఁదేనెనీ
రునఁబదనిచ్చి సన్నముగఁగ్రొన్నెలనామముఁదీర్చిమున్నుగాన్ 86

వ॥ అప్పుడు.

కం॥ మగుడగనింటికినేగుట తగునో యీపూవుమానుదండలనీఁక లె
స్సగవిశ్రమింపుటదిబా గగునోయనిసంశయింపు నాసమయమునన్ 87

సీ॥ పొదలుపూఁదోటలో వెదకి యెచ్చట నెండపొడలేని యొకగుజ్జుపొన్నక్రిందఁ
గపురంపుటనటిలేకంబంబులుగఁజేసి నెరవాదిపూవుఁ బందిరిఘటించి
గొజ్జంగినీరునగ్రుచ్చొత్తి కపురావరంగుమీరంగ నరుఁగువైచి
కనకంపుచకచకల్ గలిగిరంజిలు కన్నె గేదగిపూఁజాపఁగీలుకొలిపి
మెండుగల్గినమల్లెపూఁదండదిండు దండనొరుగంగనిల్పి యందంపుఁజిగురు
తోరణముఁగట్టి చావడితీరుదిద్ది యొలమివనపాలుఁ డచ్చటికేగుదెంచె 88

తే॥ వచ్చి యారుక్మిణీసతీవల్లభునకు నతనిదేవేరులకుననంతముదిత
చిత్తుఁడై పలుమరుచేతులెత్తిమ్రొక్కి మన్ననలుబొంది యిట్లనివిన్నవించె 89

కం॥ అయ్యా కలదొకవిన్నప మియ్యుపవనసీమనిప్డు డేనేర్పుగతిన్
నెయ్యమినొకపూజప్పర మెయ్యనరచియించితిని సముజ్జ్వలభంగిన్ 90

కం॥ ఇందుంగల్గినపూపొద లం దిరిగినయలయుకయుఁ గొలంకులచలినీ
టం దేలినయలతయుఁ బో వం దాల్మిని విశ్రమింపవలెనీకనిచటన్ 91

వ॥ అనియిట్లువిన్నవించిన నతనివినయసహితాభిహితంబులకభినందించి యంగీకారవ్యంజక లతాంగీముఖచేష్టాదర్శనపూర్వకంబుగా నంగీకరించితదాదిష్టమార్గుండై చని యొప్పులుప్పతిలు నప్పూజప్పరంబునధిష్ఠించి.

చ॥ పలుమరుత న్నఖాంచలవిపాటితనూతనకేతకాంతరో
జ్జ్వలదళసంఘసంఘటితచారుకటోత్కటకాంతిగాంచి మేల్
భళి యిదివింతయౌర వనపాల యటంచును మెచ్చి వేడ్కతో
నలజలజాక్షుఁ డొక్కయెడియార మెసంగె నెసంగవానికిన్ 93

వ॥ అంత.

సీ॥ మండితశ్రీఖండమండలీకోరకంబులఁ జేరి డాగురుమూతలాడి
కోరకాపూరితస్ఫారమల్లీలతాజాలంబులందు నుయ్యాలలూగి
ఘనసారకదళికావనసారకళికలసడలు దుమారంబుఁ జల్లులాడి
మారందనాభిదఘ్నారామసాలాలవాలాళియందులనోలలాడి
యలసిరొయో లేకయప్పురియశ్వవేగ మరసిలజ్జించిరో లేకయబ్జముఖుల
జడలకృష్ణాఘులనిచాలశయపడియొ మెల్లనరుదెంచె బాలసమీరణంబు 95

తే॥ చిరుత తెమ్మెరయపుడుదాక్షిణ్యవృత్తి । జాగి యానతసుమవక్షపరాగమెల్ల
వడటఁజేయుచు క్షితిమానవసుఖదాయి । యగుచునలరెను హరినామమమరకున్నా॥

కం॥ జిగిగలకెమ్మోవులఁ జిరు। నగవులునిగనిగలుం దేరఁ నవ్యధ్వనితోఁ
దగనందరొక్కమొగిరియై । సొగటాలాడుదమటంచు సుదతులుబల్కన్ ॥ 97

చం॥ బలితపుఁబద్మజాండమనుపాళికుటిం చటమీద బద్ధజీ
వుల నెడిసారెలుంచి రహింబుట్టఁగ నమ్మిహిరేందునామముల్
గల బలుపాచికల్గాని యలౌకికచిత్రదురోదరంబుదా
నలరమతోడనాడు కమలాక్షుఁడు మైకొనెనట్టిజూదమున్ ॥ 98

కం॥ అ త్తరిఁ జకచకలీనెడు । ముత్తెపుఁబాచికలు కనకపుంబాళికడుఁ
జొ త్తిలఁ బగడపుసారెలు । తత్తరమునఁదెచ్చియొకతె తరుణులకిచ్చెన్ ॥ 99

తే॥ ఇయ్య నవియందుకొనియంత నింతులెల్లఁ । గుండలాకారమొప్పఁ గూర్చుండినడుమఁ
బాళిఘటియించి సారెలుబన్ని తాము । కోర్కెనొండొరులనుజతల్గూడనప్పు॥ 100

సీ॥ మొగమునకోడిపూరిగఁజిక్కిశరణనిమనఁగవచ్చిన చందమామయనఁగఁ
దనకురాజైనయాతనిఁగొల్వవచ్చిన చక్కనియుడిగంపుచుక్కయనఁగఁ
జెలికానికాలిఁకఁబచ్చెనటంచునాతని నరయవచ్చినప్రభాకరుఁడనంగఁ
దొంటివేడిమిఁ బాసికంటికింపుగ మేననిండినపొందునీరెండయనఁగ
మురియుతిరుమణిముకుకమ్మికుత్తియంబు । రమ్యపతకంబుపీతాంబరంబుమెరయఁ
జెలులచుంబనపణమాడి చేయిఁజరచి । కేరుచునుజూదమాడె మురారియచట ॥ 101

సీ॥ కంకణంబులుమ్రోయఁగా దుగా బేత్రి చొవంచంచుఁబంటెములో వైచువారు
వాసిఁబందెమువైచి యేసారెయని సారెనంచించితగ సారెలాడువారు
ఆడుమాటల జూదమాడఁగూడదటంచుఁ బరులనుల్ల సములఁపలుకువారు
తమినొరుసారెచేఁదనసారెఁబడుచు సుందరినోర్చు వీక్షించినగెడువారు
నాతియొక్కతెసావధానముగ నెత్తు । లంచనలుజూడఁగనుదత్తరించువారు
నగుచుఁజెలరేగియపుడుదైత్యారితోడ । నింతులితర ప్రపంచంబులెల్లమరచి ॥ 102

వ॥ మరియును. 103

## రగడ.

చేడియకోపము చెప్పినమాటకుఁ బాడిదప్పినా భామామాటకు
పేలగఁజూచెద వీడఁగనాడకు తాళముసారెకుఁ దప్పగనాడకు
కనవాయొక్కఁడు కనుగవచేరకు వనరివేడ్కఁజనివాదుకుజేరకు
పందెమువైచితి పంజాలకమ్మకు సుందరినైకొని నుపతింగమ్మకు
నీమాటలసిరి నేరుపుచిల్కకుఁ గోమలివాటపుఁగ్రోధముజిల్కకు
నీకోకఘనమా నేర్పులనిక్కకు జోకనుదనుగెల్చుటకునునిక్కకు
వాశలినాడ గోరానినజేర్తకు చాలనులికిపడిచలియులజేరకు
కత్తియపాల్గొనుకస్తురియుండకు పొత్తులగెలుపదిపోనిదియుండకు
రామతెలిసెనీరక్కసిదాయకు నీమృషలన్నియు నిజమనిదాయకు
దక్కియోడెనని తాపపుటుబ్బకు చిక్కిదవిటుగెలిచెదననియుబ్బకు

పగిడిపండెమిదిబంగరుగోరకు  మగువయోడి క్రమ్మరరాఁగోరకు
బాలగెలిచెనేబాడినయేలకు  తాళకకటువార్తలనన్నేలకు
వెలదిజంతవేవెన్నునియానకు  గెలిచిమొగంబునఁ గికకికలానకు 104

వ॥ అనుచుఁడమలోనమఱియును. 105

సీ॥ సారసాస్యయొకర్తుసారెఁదెచ్చితినన్న  సారెకుఁగలుగువాచవియటంచు
వ్రీడాపతియొకర్తుజోడుగూడుమటన్న  నెవ్వరిమీఁదదండెత్తెదనుచు
వామాక్షియొకతెతీవంచవేయుమటన్న  నదిశిల్పిరాకయొల్లొనటంచు
సుదతియొక్కతెయెత్తుఁజూడంగదగునన్న  నొకపట్లమిగులంగనొప్పననుచు
సరససల్లాపభంగినుత్సాహమొంది  చేడెలెల్లదురోదరక్రీడనుండి
రత్నవిక్షేపచలవిలయస్వనోద  పాస్తముఖపంకజభ్రమద్భ్రమరలగుచు 106

శా॥ పశ్యత్పాదగణా కుమారిలగతృక్స్వాపండబుద్ధాబ్జభూ
పశ్యత్ఫాలమతప్రచండనుతతత్వం కేశజాడ్యాద్రిరా
ట్పశ్యద్దేహాత్ప్రపాణదుర్భటవచఃపద్యాప్తహృద్యానసా
పశ్యత్స్వాంతశిరఃపరిష్కరణశుంభద్భాష్యకారాహ్వయా 107

గద్య

ఇది శ్రీమద్రామానుజభాగినేయకులసార్వభౌమ
శ్రీమన్నల్లనాచార్యవర్యపరిచర్యాధుర్య
చెన్నకేశవాచార్యపుత్ర
తిరుమలాచార్యపౌత్ర
గౌతమగోత్రపవిత్ర
సింహాద్రివెంకట
నామధేయప్ర
ణీతంబైన

మహాప్రబంధ చమత్కారమంజరీ కోరకాయితంబగు
ప్రథమాశ్వాసము



# చమత్కారమంజరి.

—:(o):—

## ద్వితీయాశ్వాసము.



కం॥ శ్రీమత్ప్రాంగణపరిసర । స్తోమసముత్కీర్త్యమాణ దుర్ధర్ష భవో
ద్దామాఘశిలవిమర్శ క । శ్యామలకర త్రిదండ లక్ష్మణయోగీ 1

వ॥ అవధరింపుము 2

మ॥ అప్పుడా ముత్తైదుపాచికల్ విడచి తానాడంగ నందొక్కసా
రెపయింగేలటుసాచి భీష్మకధరిత్రీజాని గారంపుపు
త్రికపరాకయ్యె విలోచనాస్యములనుద్వృత్తాద్భుతావేశచి
హ్నపటూద్భాసివికాసవాసరుచులందంబొప్పసంధిల్లఁగాఁ 3

సీ॥ కమనీయచలవాతకంబళాందోళితకుండలంబులు దిద్దుకొంటమాని
ధళధళాయితఫాలఫలకనిర్మలఘర్మశీకరంబుల గోటఁ జిమ్మమాని
శ్రుతిపుటీఘటితమంజులమంజరీభ్రమదృంగీగణములఁ దోలంగమాని
తనులతాచ్ఛాదకాదభ్రసితాభ్ర రంభాపరాగం బెడబాపమాని
చటులతరయోషిద్ద్విపదుచ్చైర్నిబద్ధ । బహుళకింకిణిక్రియోత్తరభంగిమాని
చేష్టలెల్లనుదక్కియచ్చోలివహించె । ఘనతరంబైన పాంచాలికాక్రమంబు 4

ఉ॥ కొండొకసేపిటు ల్కుటిలకుంతలి గాఢపరాకవస్తచే
నుండి ప్రబుద్ధయై తలయటూచి యొకించుకనవ్వి శార్ఙ్గకో
దండునితోడఁ జెల్వాల సుదారతఁగన్గొనుచుక్ విలాసితా
ఖండతఁ బందెమేరిదనఁ గంజదళాక్షుఁడువల్కెసెమ్మితోన్ 5

కం॥ ఏలపరాకైతివినీ । వాలాగునమాతృసోదరాదులునీకి
వ్వేళఁదలంపునవచ్చిరొ । బాలా నాయాననీకుఁ బన్నడఁజెపుమా 6.

చ॥ అనవుడు రుక్మిణీసతియు నన్యవధూపృథురామణీయకా
భినయకథల్ జయింపఁగను బెద్దయొనర్చియు నంతనాత్మభా
వనిహితవిస్మయప్రథితవిపక్షభరంబయి తోఁచి శౌరితో
ననియె నుదారతాఘనరసాయనమాధురిసాధురీతులన్ 7

మ॥ ఇల లేబొన్నకుఁ జేరి వ్రాలి, యవి తా మెచ్చోటివో వింతరా
చిలుకల్ బల్కఁగ నాలకింపుచుఁ బరాక్షిప్తంబుతో నుంటి న
ప్పలుకుం జెప్పను టంటివేని మనలన్ బారంగ నీక్షించి య
చ్చెలితో నొక్కశుకంబు మంజులవచశ్శ్రీఁ బల్కె నిబ్భంగులన్ 8

మ॥ తెలియం జూచితి మెంతయున్ నిఖిలదిగ్దేశంబు లాడాడకున్
గల పేరెన్నికఁ గన్నకన్నెలఁ గడున్ గన్గొంటి మొదైననుం
గలరే యిట్టి విచిత్రపాత్ర శుభదాకారాఢ్య లెంతైన ని
చ్చెలు లెల్లన్ మనలక్షణాసతికి లోజ్జేనుమ్మ రమ్యాకృతిన్ 9

కం॥ అరయఁగ నరోచకములీ పురుషమణిం గాంచు నేత్రపుటయుగములకున్
శరహర మురహర పురహర వరసఖనందనుల కూప వైశద్యంబుల్ 10

చ॥ అల మనలక్షణాసతికి నర్హుఁ డితండు వరుండు గాఁగ నే
వలహితబుద్ధిఁ జూడ బహువల్లభుఁ డన్నది యొండె కాని యం
చలశుకభర్త బల్కె నన నాహరి యేగతిఁ బక్షిభాషణం
బులు దెలియంగ నేర్చి తదిపొందుగ నాకెరిఁగింపు మెంతయున్ 11

సీ॥ నావిని భీష్మకనందన బల్కె మావారి వీటను బహిర్వనములోనఁ
గంకాళకటక నాఁ గలదొక్కశక్తి నేనా దేవిదర్శింప ననుఁగుచెల
నోడఁగూడి కన్నియపడచ్చనై యొకనాడు నీరాడి కడుశుద్ధి చీరఁగట్టి
కుడువక మునుప యగ్గుడికేగి బంగారుపూవుల నాయమఁ బూజజేసి
యలికఫలకస్థలమున నంజలిఘటించి చక్కదనమును నాయువు సంపదయును
నతులకీర్తియు ధర్మపద్ధతియుఁ గలుగు । మగఁడు గావలయునటంచు మదినిగోరి॥12

కం॥ దుర్గే లీలాలోలిత । భర్గే కరుణాకటాక్షపాలిత తనుభృ
ద్వర్గే రామస్మరణని । సర్గే మాం పాహి యనుచు సాగిలిమ్రొక్కన్ 13

క॥ కలకలముఁజేసెనవ్వాకలఁగలవిహగంబు లొక్కటగమిగూడిమిగులం
గలగళతనప్పుడుండితి।గలకలతోనేమిదేమికారణమనుచున్ 14

ఉ॥ అప్పుడు పాంధవేషముననచ్చటనొంకశ్లోకవృద్ధసిద్ధుఁ డీ
విప్పలుకెట్టిదోయనుచునెంతయుఁజింతిలనేల యవ్వ మేల్
జెప్పుటకాని యొండుమరిలేదనియూరడిలంగఁబల్కినా
కప్పురుషాధ్యుఁడిచ్చె వర మండజవాగవబోధసిద్ధిగాన్ 15

ఆ॥ నాటనుండి నాకునానావిహంగమ।భాషలెల్లఁ దెలియఁబడుచునుండు
ననుచుఁ జెప్పఁ గృష్ణుం డంగుళి నాసాపు। టీతటమున సంఘటించియపుడు 16

కం॥ మిగులగనక్కజమనుచును।దెగువంజాలించి కేళి దిగ్గనఁజనియెన్
మృగనయనయోర్తు గిల్కలు।పగడపుపావలు నిజాగ్రభాగముననిడన్ 17

వ॥ అప్పుడు నానాప్రసూననికాయకాయమాన స్తంభీకృతరంభాకాండంబుపై
నొక్కింతయొరగి కొన్నినలఁజెన్నగుపొన్నలకై మొగమెత్తి 18

తే॥ చాలలోలేక్షణుండై విశాలశాలి। సాలబాలప్రవాళప్రవాళపంజ
రాంతరనితాంతవిశ్రాంతకాంతరాజ। శుకయుగముఁగాంచెఁగాంచనాంశుకధరుండు

కం॥ ఈగతిఁగన్గొని యత్యను। రాగముతోనంతఁ జిల్కరాల్చినయొకపు
న్నాగప్రసవముఁగని యది। వేగమెకెంగేలఁదాల్చి వెలదులతోడన్ 20

మ॥ అమరంగాఁ దమలక్షణాఖ్యకమలాస్యాలోకచూడావతం
సమునాభీపుట మిట్లెసంగుననియిచ్చన్ నాకెరుంగించుచం
దమునన్ రాజశుకాధ్య మీవికచపున్నాగప్రసూనంబుఁదా
ల్చె మదగ్రంబున లేమలార మిగులం జిత్రంబుగన్గొంటిరే 21

వ॥ అని వెండియుఁ దదాకారశోభావైలక్షణ్యంబుగాంచి మనుష్యవాగవబోధ
సామర్థ్యంబు వీటికిసంభవించ నేర్చుననితలంచి

సీ॥ ఓరాజకీరంబులార లక్షణయనుకోమలి యేరాజుకూతుకొక్కొ
యప్పణ్యాసంశీలుఁడైనవిశ్వంభరాధీశుఁడే లెడిది యేదేశమొక్కొ

యట్టిదేశంబున వక్రాంత మమ్మహీధవుఁడున్న దేరాజధానియొక్కొ
పరిశుద్ధ తత్త్వభావస్వభావంబు లేపగిది మీకెఱుఁగంగఁబడియెనొక్కొ
యీయలౌకికశోభ మీకెచటివొక్కొ యిచటికేతేర మీతలంపెద్దియొక్కొ
యిన్నివృత్తాంతములును మాకేర్పడంగ వరుస నెఱిఁగింపుడని యదూద్వహుండు వేడ్క

వ॥ ఇట్లు వేడినయతని యాత్మభాషావబోధకౌశలంబునకునక్కజంబంది యతని పున్నాగప్రసవాత్రైక్ష్ణ్యంబునకుమిగులం దలయూఁచి యతనిపృచ్ఛావైఖరీ వైశద్యంబునకు మెచ్చి తత్సహసంభాషణాపేక్షులై నికటసముల్లసత్ఫుల్లవకుళమంజరీపంజరంబున నధివసించి యొక్కకీరసార్వభౌమంబు మనుష్యభాషణంబులనిట్లనియె.

కం॥ జోహారో పురుషోత్తమ । యోహో నీసేయుప్రశ్నమొనరె సురాహా
రాహంక్రియాపహారి । వ్యాహారాహీనవిహితవైఖరితోడన్ 25

వ॥ అనిమరియును 26

ఉ॥ తానొనరించుదేశములఁ దద్దయు నంచితసంచితాసహా
శ్రీనిరపాయతం దనువశీకృతుఁ జేసిన మెచ్చి భారతీ
జాని యొసంగమద్రమనుసంజ్ఞ నెసంగెడు నొక్కదేశ మో
మానవతీమనోజ మహిమండలిలోఁగల దందునారయన్ 27

మ॥ మతి నెన్నందగి యానువత్సరికహేమంతార్ధ బాలామనః
కృతబాలాతపసేవనోద్యమ నిరర్థీకారదక్షధ్వజా
యుతవిభ్రాజితభర్మహర్మ్యములతో నుర్వీజనస్తుత్యసం
స్థితిఁ బ్రోలొక్కటి రత్నగోపురమనాఁ జెన్నొందు నశ్రాంతమున్॥ 28

తే॥ అదియునిజరాజధానిగా నధివసించి । చెలగున ద్దేశపతి బృహత్సేనుఁడనఁగ
నతనికీర్తిప్రతాపంబులరసి యొన్నఁ । దరమె చిత్రశిఖండినందనులకైన॥ 29

కం॥ కోదండచండనిజభుజ । కోదండముదండమేలకో మాకరిరా
ద్వేదండసింహ యిఁక నీ । వేదండనికొలుచు శత్రువిసరములతనిన్॥ 30

సీ॥ తనకునుద్ధతమధుధ్వంసిజాగ్రత్కరాగ్రస్థచక్రంబు కంకణముగాఁగఁ
దనకు జలంధరాంధకహారిబాహురింఖత్త్రిశూలంబు చిక్కంబుగాఁగఁ
దనకు ధరాంధరాంతకభుజాభిదురాసితల్పజంబుది రచ్చబల్లగాఁగ
దన కంబుకీశహస్తప్రశస్తోగ్రపాశంబు సందిటిదోరకంబుగాఁగ

దనకునుద్దండదండభృద్దండమెపుడు కొలదిహాల్లీసకపునుమగోలగాఁగఁ
మించుదుళికించి జగమాక్రమించి మించి । తనరెనమ్మేటి భవ్యప్రతాపలక్ష్మి 31

సీ॥ కాలమేఘంబైనఘనునకో సంఛన్నశంద్రతారకత నిజ్జగతిఁబరఁగు
నమరాగమైనమానగునకో కీలాలపానంబుఁగావించి ఫలమొసంగు
యామినీవల్లభుండైనరాజగునకో తనరారులేఖాఘునాతయగుచు
వేలుపుటావైనవెడలెనొక్కొక్కొమ్ములెపుడుకుంభగ్రాహ్య మీగితలపఁ
ద్యక్తజీవనమైనః బ్రతావలంబ మాచరించిన నగ్నిముఖాంతరమునఁ
బడినఁ దల్రకిందయిన నేమిప్రతియొ దాన సరణిసెన్న బృహత్సేనధరణిపతికి 32

ఉ॥ ఆతఁడుపుత్రుఁడౌట మమునాదరమొప్పఁగఁబెంచె నంత వి
ఖ్యాతగుణాఢ్యులైన సుతులఁగాంచియు వారలకన్న నెంతయుం
బ్రీతిదలిర్పమమ్ముఁ గడుఁబెద్దయుమన్ననసేయు మత్స్వమా
యాతమహార్థ మొప్పగునటంచు సబంధుకళత్రమిత్రుఁడై॥ 33

సీ॥ రమణా ప్రాయుదుముత్తరములు తత్తద్దేశపతులకు చెప్పన్న భాషలెసఁగ
వివరింపుదుము పరోర్వీనాధసంధాన ఘనయుక్తి కౌశలగౌరవములు
ధీరయోధుల కుపదేశింతు మతులదుర్గత్రాణనైపుణీప్రక్రమములు
నీతిశాస్త్రాభినిర్ణీతవైఖరులతోఁ దగవులుదీర్తు ముత్తములుమెచ్చ
పొసఁగ రాజాత్మజులకు జెప్పదుమసంఖ్య । వ్యాద్యసాహిత్యగీతాదివిద్యలెల్ల
సకలదేశాగతమనీషిసూకవిజనుల । చొప్పలెరిఁగింపుదుము మహీశునకునెపుడు 34

చం॥ ఒకతరిలోకవార్తలను నొక్కతరిన్నృదుగానకౌశలం
బొకతరిసాహితీరసము లొక్కతరిన్ ఘనసత్కధాక్రమం
బొకతరిశాస్త్రవైఖరులు నొక్కతరిన్నిగమోపధానముల్
ప్రకటనచేసి యాధరణిపాలున కూరటచేతుమెంతయున్ 35

ఉ॥ చక్కెర లప్పముల్ మధురసంబును జున్ను రసాయనంబులున్
జిక్కనిమీగడల్ ఫలవిశేషములు న్మనుముమ్నెమాకుఁదా
నెక్కుడుప్రేమతోడ భుజియింపఁగఁబెట్టకపుక్కిలింప దా
చొక్కపువర్తనల్ గలిగిశోభిలుపట్టపుదేవి యొప్పడున్ 36

వ॥ ఇంక మద్గమనకారణంబువిన్నవించెద మవధరింపుము 37

ఉత్సాహ॥ బల్లిదంపు సెవ్వ నొవ్వఁబాజియున్న యీజగం
బెల్లఁజూచి తేవఁ బ్రోవ నిందిరేశ్వరుండుదాఁ
గొల్లవాడఁ బంధులుంఘుసజ్జుమంతమావిసై
యుల్లసిల్లెఁదొల్లి యెల్లియోాయనంగధాత్రికిన్ 38

గీ॥ తన్మనోహరకోటరాంతరమునందు । నత్యలౌకిక తేజోమహత్వమునను
బుట్టితిమిముప్వరముకీరపుంగవులము । వాణి యతివాణియును మహావాణియనఁగ

సీ॥ అందుమహావాణియనియెడుమజ్జ్యేష్ఠశుఖశిఖామణి కళాస్ఫూర్తినొప్పి
యహరహంబు నపారబహుమానలీలతో వాగ్దేవికరపల్లవముననుండు
నా చిల్కఁగనిద్వాదశాబ్దముల్ గావచ్చె నదిగానబ్రహ్మలోకాంతరమున
కరిగికన్గొనిముద్దులాడిక్రమ్మర నేగుదెంచుచున్నారమీ తెరువుచేరి
మరియునిటమీఁదమారాజమదనుపుత్రి । యమితలక్షణ లక్షణయనఁగబరఁగు
నట్టికన్నియ కీడుజోడైననవరుని । నరసి వెదకుచు నిపుడు మే మచటనచట 40

గీ॥ ఆవరారోహరూపరేఖావిలాస । విభ్రమంబులువర్ణింప విధి కశక్య
మైన నా నేర్చుగతిఁ బురుషాగ్రిగణ్య । నీకు నెఱిఁగింపవలసివర్ణింతుఁగాత 41

చ॥ మెలత మొగంబుచందురుని మెచ్చుఁగుచంబులుఃకుందనంపుబిం
దెలకగుసం ప్రతుల్ తళుకుదే ఱెడుకన్నులుబిత్తరంపుగ
ల్వలపొరు గిందనీలపుసళాకలవంగడమారుతీవె తేఁ
టులపదుగందపుం సెరికడుల్ బిగియాజిగి నెన్నిగూచినన్ 42

గీ॥ అరుణపల్లవములఁబోలు నాపదంము । నాపదంబులఁబోలు నయ్యలకజాతఁ
మలకజాతముఁబోలు నిత్యముఖలీల । నిత్యముఖలీలబోలున న్నెలతనడుము 43

సీ॥ మరునివిల్లైక్కుడుపొరయకుండగనాఽశెవవిలాసస్ఫూర్తిఁజెందుబొమలు
పేరనంటులఁ బెచ్చు పెరుఁగకుండగవంచె భద్రలక్షణములఁబరఁగుతొడలు
జెలువైనకృష్ణాహి తలయెత్తకుండంగనడఁచె విరాజితంబైనయారు
సొగసుమీలను ముల్లుచూపకుండహరించె ఘనరశ్మిజాలవాకన్నుదోయి

ఇందుకళ లెల్ల గణనకు నెక్కకుండఁ । బట్టి బహుళద్యుతుల్ గలప్రాంతలము
గండు నెమ్మిల బొడచూపకుండఁ జేసె । వితతశుచివృత్తిగల యలివేణి వేణి 44

క॥ చన్నులకోకగుటియె పదా । ర్వన్నెపసిఁడితమ్మిమొగడవన్నెల్ గిన్నెల్
కన్నియపిఱుఁదున కెదురే । చెన్నగుబలుదీవిగలుగు సిరులున్ గిరులున్ 45

గీ॥ అల్పతరమంట యాసరోజాక్షిమధ్య । మెన్న నది సుఖమైతోఁచకున్నె పతికి
ఘనతరంబంట యాకంబుకంఠిజంఘ । మెన్న నై సహ్యమై తోఁచకున్నె పతికి 46

చం॥ చెలిగళసీమతోడ నెనసేయఁగ నొంటుపరంబె మానినీ
తిలకము నాభితో సవతుదేసుకరంబె లంతాంగికుక్షితో
లలినొకటీడుచూపఁగదరంబె మదిన్ గడుసాహసించి యా
నెలతుకకౌనుతో సరిగణింపఁగఁబూనసుఖంబె యేరికిన్ 47

సీ॥ తారావళులఁబట్టి తారావళులఁ జేయు సత్వంబుఁ జూపె నా సఖి నఖములు
నీరజంబులఁబట్టి నీరజంబుగఁ జేయు సారస్యమొంచె నా చానమోము
మదవారణముఁబట్టి మదవారణముఁ జేయు భద్రత మెరసె నా పడఁతినడక
యాపదాళులఁబట్టి యాపదాళులఁ జేయు ఘనతకుఁ బెనగె నా కాంతవేణి
యెక్కువలయంబులనుదమి నేపుమీర । నెక్కువ లయంబులొనరించునీక్షణములు
ప్రౌఢిజీవనభంగముల్ ప్రాతికూల్య । మునుప జీవనభంగముల్ పెనుచు వళులు

సీ॥ బాలపాక్కిలి కొక్కబావి జోడంటిమా యిల బరోద్ఘాటనంబులఁ గృశించు
సతిమోమునకుఁ దమ్మి సరియంటిమా భువనంబులో మిగులంగ నాలియయ్యెఁ
గొమ్మ పాలిండ్లకుఁ గొండ లీడంటిమా బ్రతుకెల్ల రాకొట్టుపాలు జేసె
వెలఁదిచూపులకుఁ బూవింటిజోదమ్ములు సాటంటిమా విరిపోటులయ్యె
నొగి మహారామపదనిష్ఠనున్న ఘనతు । శాఖిశాయితనున్న శైలాఖ్యనున్నఁ
దగఁ బరాశ్రయితనున్నఁ దత్తదంగ । రూపభాగ్యంబులవి చెందనోప వెందు 49

మ॥ వనజాక్షీ తిలకంబుపాక్కిలిమహావాప్యాకృతిన్ సంగ్రహిం
చిన మూలంబున నక్షయస్ఫురణచేఁ జెన్నొందు టాశ్చర్యమే
యనఁగా నేల విశేషజాతిసమవాయశ్రీమయంబై వధూ

జనచూడామణుమన్ననియంగమార్దవమునిస్సామాన్యమాటల్ర మే 50

చం॥ అల చెలి లంబకేశనిచయంబునుతింపఁదరంబె యయ్యరో
విలసితముఖ్యవర్ణమునుపేడనియద్దియొద్దానిసాటి గు
బ్బలసిరులన్నఁజోద్యములు భవ్యతరాగ్రతనొప్పనవ్వియే
కొలదులు వానికింకనొనగూడునె యున్నవి యెన్నియేనియుణ్ 51

కం॥ అన్నలుమోములదేవుం । డన్నాతికి లేదు మధ్యమని చెప్పుటకై
నున్నలిఖించినకై వడిఁ । గన్నియకునునాభి వింతకాంతులనమరుణ్ 52

చం॥ లలితకటీరఘుమధ్యజవిలాసమహీధరనాభికంధర
స్థలరుహరోమరాజిసముదాత్త తమాల లతాధివాస మాం
సలకుచ చక్రదంపతులు చక్కఁగఁదెచ్చుమృణాళనాళవ
ల్లులగతినొప్పఁ బంకజవిలోచనబాహువు లింపునింపుచుణ్ 53

చం॥ అలకటి కప్పఁగొప్పఘనహాటకవారిదఘోటకాశ్మముల్
కళుకులు దేరఁజెక్కసరిగద్దెలునిద్దపువెన్ను నెత్తపుం
బలుకయు నయ్యెఁ గల్కి యలప్రాయపుఁగ్రొవ్విరితోటలోన వ
ర్తిలురతికాంతకుణ్ మొగలిరేకుకటారిమిటారికౌతుకుణ్ 54

మ॥ అల పుష్పంబులు జెందెఁ బొందుపడ నయ్యబ్జాక్షి హాసాంకురా
త్యలఘుశ్రీలకుఁదక్కువై మిగుల నూనాంకంబుఁ దత్కాంతికాం
తుల జన్నంబులు పెక్కుసేయఁ బ్రసనాఖ్యం దానఁ జొక్కంపుఁ జా
యలుగల్గణ్ సుమసంజ్ఞ నంత సుమనఃఖ్యాతిణ్ స్శుచిత్తస్థితిణ్ 55

తే॥గీ॥ అట్టికన్యాలలామంబు నంబుజాక్ష। నీవెవరియింపఁదగుదువు నిక్క మింక
దేవ దేవరనామంబు దెలియనలయు । నన్న నెరిఁగించె శ్రీకృష్ణుఁడనుచు నొకతె

వ॥ అంతనక్కరసార్వభౌమంబు పునఃపునరభివందనంబులాచరించి 57

సీ॥ మంగళంతే ఽఖిలామ్నాయశాఖాశిఖా పల్లవాయితదివ్యభవ్యచరణ
మంగళంతే రమామానినీకుచశై లనీలాంబుదీభవన్నిర్మలాంగ

మంగళంతే నాభిమహితసరస్థపంకేరుహాకర్ణికీకృతవిరించ
మంగళంతే ఽంఘ్రితామరసనిష్యందమరందద్భగీరథనందనీక
మంగళంతే ఽక్షిభాపసంప్రాప్తయామి। నీశదినకర తౌల్యపరిక్షమాణ
హస్తగతకీర్తితేజఃప్రశస్తదీప్త। శంఖచక్రాభరణ దేవసార్వభౌమ 58

చక్రబంధము

శా॥ సత్యాభాతనవేందుమాళికచితా సంఖ్యాప్రకారస్తనా
సత్యేష్యస్చుభకరాభ్రమభానరతతన్మాకన్యకాకృష్టధీ
రత్యేకార్ద్రికటాక్షపక్షిరథజైత్రవిశ్వభూతిధ్రువా
వాత్యాభూసలిలానలాంబరమయీ వాగీరథీరోత్సవా 59

పుష్పబంధము

స్రగ్ధర॥ రామాకామా రమాసంశ్రయ నయజయసంగ్రామసీమప్రమత్తా
థామాత్మామార్యమాభూధరవరభరణా దారితారిస్వరిభ్య
స్థేమాసామాగమానందితిహతవితతా శ్రీకలోకత్రికప్ర
క్రామా శ్యామాబ్దమాలాక్రమవిమలమహాకాయ గేయప్రయత్నా 60

వ॥ అని స్తుతించి 61

ఉ॥ నీకునభీష్టమేని రమణీయగుణోదయ భవ్యనవ్యలీ
లాకలితాయతాక్షి యలలక్షణనాఁగలకొమ్మ సమ్మతో
ద్రేకమెలర్పఁగన్ నినువరింపఁగఁజేయుదు రాయబారినై
యో కమలేశనే పదమహోత్పలదాస్యమె యోగ్యశమాటచేన్ 62

వ॥ అని సాంత్వకరణంబుగా నక్కీరసార్వభౌమంబు సర్వంబు విన్నవించిన వి
స్మితస్మితవదనుండై యవ్వలపీవిభుండు 63

శా॥ రామాకోమలరామణీయకకథాప్రారంభముల్ నిర్ఝరాం
ధోమాధుర్యధురీణముల్ మొదల సంస్తుత్య త్వదీయాచ్ఛవా
చామార్గంబున నిర్గమించిన విశేషస్ఫూర్తితో నవ్వి ర
కామాశ్వాన్వయ భూరిభూరితర సౌగంధ్యష్ఠి తిన్ బొల్పవే

కం॥ నీ వ ప్రార్థితపూర్వుఁడు । గా వెలఁది నినుఁ వరింపఁగాఁజేయుదు నే
వే వేగననుచుఁబల్కుట । భూవినుతా కొంగుముడియ పోలుఁ దలంపన్ 65

సీ॥ అఖిలవత్సరములు నంబుజాక్షీ వియోగులకు విలంబు లోగుణసముద్ర
యుభయాయనములు కాంతోరుమర్విభులకు నుత్తరంబులు విచిత్రోజ్జ్వలాంగ
ఋతువులన్నియు సుందరీదూరులకు శరత్తులు కీరవంశ పాథోధిచంద్ర
సకలమాసములు యోషారిక్తజనులకు జ్యేష్ఠంబు లమలభూయిష్టచరిత.
పక్షములు రెండు బహుళముల్ ప్రాజ్ఞతిలక । తిథుల శేషము దశములు ద్రిక్త తేజ
వారములుసర్వమును గురువారములు ప్ర । సూనశరహయప్రియవధూశూన్యులకును

చం॥ అలికచయోరురంభల భుజాంచితశాఖల నాభిదీర్ఘికన్
బలితపుగబ్బిగుబ్బ పువుబంతులఁ జెల్వగునవ్వనెన్నెలన్
గళకులుగుల్కుపల్కునునుగ్రపుఁబల్కుల మోవి పానకం
బులఁ దనివందికా కెటులుపుచ్చెద నిట్టివియోగతాపమున్ 67

కం॥ అదికాక యింక నే నా । మదనునితరితీపులకునుమార్పడలే నో
మృదుహృదయ తత్సుధాకర । వదనన్ ఘటియింపజేయవలయున్ వేగన్ 68

కం॥ వలవదు తెలుపఁగ విద్వ । త్కులతిలకమ నీకుఁ గార్య గురుతర సరణుల్
తళతళమను రెక్కలతో । వెలసినఖగపతికిఁ దగటి వీ వనవలె నే 69

వ॥ అని యనురాగవ్యంజకంబుగాఁ బల్కిన నప్పుడు 70

చం॥ లలనకుచంబు లిట్టుకరలభ్యములయ్యెడునీకునంచు న
చ్చిలుకలరేడు దీవెనలు చేసియొసంగె సురారివారికిన్
జలరుహగర్భ లోకపద సంగతిరాఁ దన కింద్రుఁ డేర్చి సం
బళముగగట్టునందనజభవ్యఫలంబులు రెండు మెండుగన్ 71

వ॥ ఇట్లుసమర్పించి దేవా వాచాడంబరవిలంబంబు లింక నుచితంబులుగావు గా
వున వెడలెద నాజ్ఞాపింపుమని యక్కీరసార్వభౌమంబుపునరభివందనంబొనరించి సా
నుజంబై రత్నగోపురనగరాభిముఖ్యంబునన్ జనియె నంతనిచ్చట 72

సీ॥ చిన్నటనాఁడు కార్చిచ్చు జేఁజుఱ్ఱగాఁ బీల్చినబింకముల్ బెళుకవయ్యె
సల నాఁడు సుడిగాలి నలయించి పొలియంగఁ జదుపుజంఝూటముల్ సాగవయ్యెఁ
బోనాఁడు రాముఁడై బూతంపుఁజిల్కలఁ గొట్టినబడబడల్ గట్టువడియె
మునుపు గజేంద్రుఁ బట్టినకోల్ మొసలిఁ బోవనడచుహళాహళుల్ నడువవయ్యె
నపుడు తను నేచుఘన విరహాగ్నియందు । మలయపవనునియందు రాచిలుకలందు
మరుసిడమునందు మద్రభూవరకులోత్తమాత్మజాయత్తచిత్తుఁడై నట్టిహరికి 73

చ॥ కమఠకిటిక్షితీశకులఖండనవామనజన్మవాసనా
క్రమమున సంపచన్నఖత గాంచును జీరుఁగ రాతలంబుని
త్యముమరి రాజనంగలఁగుఁ దద్దయు మానము దాల్చు రుక్మిణీ
రమణుఁడు పంచసాయకశరారుశరాహతిపాత్రాత్ముఁడై 74

క॥ నీలాంగుఁడు శుకవర్ణిత । బాలాజఘునేక్షణములు భావించుకొనున్
నాళీకాస్త్రుఁడుచిత్తము । నేలకు గోలకును దెచ్చు నేర్పరి గాడే 75

వ॥ అంతఁ దదంతఃపురకాంతావర్గంబును స్వాతిశయితరూపరేఖాసంపన్న సప
త్నీసమాగమసహితభూతనిజపాండిత్యప్రపంచయైన రుక్మిణి నుద్దేశించి 76

సీ॥ తననఖప్రకరంబు తనకె వాఁడితనంబు చూపెఁగాయని సత్య మోపియాడె
తన్నుఁ గట్టఁగఁ ద్రాళ్లు తానె తెచ్చునటంచు నతిని నారతఁ బల్కె నాసుదంత
నిష్పని యెడిమాత్ర నే నోరుపొక్కనాయని చెప్పెఁ గాఁబోలు ననియె భద్ర
మంచిమాటల నాటమాని యోడించుకోవలసెఁ గాయనె జాంబవత్తనూజ
చేయునవి యింక గతజలసేతుబంధ । మిత్రములటంచు బల్కె న మ్మిత్రవింద
యనఁగ నేటికి దైవమన్యత్రచింత । యే త్తనుచుఁ బల్కె యూరార్చె నినతనూజ 77

వ॥ అప్పుడు మాధవుండు శుకపికనికరకోలాహలభీకరంబయిన యవ్వనంబు వెడ
లి నిజమందిరంబుం బ్రవేశించి సముల్లసితపల్లవతల్లజవేల్లితానల్పప్రదేశంబున నెమ్మేను
వాల్చి యక్రూరకులధురంధరు పునరాగమనంబు నిరీక్షించుచుండె నొక్కభంగి వంతని
క్కడ

సీ॥ వరపచేళిమ ఫలాస్వాదనలీలతో బెళిదంపుటడవులు వెడలి వెడలి

శతపత్రఘుమఘుమాంచిత జలకేళితో గాటంపుఁగయ్యలు దాఁటిదాఁటి
రంగత్సముత్తుంగ శృంగవిశ్రాంతితో మెండైనకొండల మించిమించి
తత్రత్యవస్తు సందర్శనఖేలతోఁ గడుపెద్దపల్లెలుగడచిగడచి
హర్మ్యాగతగాత్ర గీతభేదాభ్యుదిత । ఘనఘనాఘనవృత్య దగారబర్హి
రుతసముత్క్రాంత్యవంతికాదుణరధాహిబంధయగు నాత్మపురిఁ జేరెఁ బతగమౌళి 79

తే॥ రత్నగోపురమీరీతి రాజశుకము । చేరి హర్షంబుతో బృహత్సేనునతని
దేవిఁగని మ్రొక్కి పుత్రపుత్రీగణంబు । నుచితవైఖరి మిగులబహూకరించి 80

శా॥ అంతన్ వారికిబ్రహ్మలోకమున నిత్యంబుంబ్రవర్తిల్లువృ
త్తాంతంబంతయు బూసగుచ్చుగతినభ్యంచద్వచస్ఫూర్తితో
నెంతేనింతగఁజెప్పి యిచ్చెమరి మానీందాదిధార్యంబు ల
శ్రాంతాక్లాంతసుగంధసాంద్రములు భాషాదేవినిర్మాల్యముల్ 81

వ॥ మరియు నక్కీరసార్వభౌమంబు మజ్జన భోజనాద్యుపచారంబుల విశ్రమిం
చి సుఖంబుండ లక్షణాకన్యయే తెంచియిటులనియె 82

కం॥ ఓయీ రామన క్రొమ్మర । వే యిటకే తెంతుననుచు వెడలియు నిట్టు ల
త్యాయతమగుఁనాలస్యము । జేయ నిమిత్తంబునాకుఁ జెపుమాయనినన్ 83

చ॥ వినిశుకరాజ మమ్మఖపవేశికియిట్లనిచెప్పె వేగఁ ద
ద్ఘనపథపద్ధతిన్ వెడలి క్రొమ్మరమేమిటురాగ నేత్రముల్
దనివివసింపఁ దత్ప్రతిఫలత్సురలోకమనంగ నంబుధిన్
గనఁదగెనొక్కపట్టణ మఖండితమండితభర్మహార్మ్యమై 84

వ॥ మరియును 85

సీ॥ స్ఫారహీరమసారసారవారాభినిర్మితసాలరేఖకు మెచ్చిమెచ్చి
యంబరసరిదంబచుంబికేతుకదంబకాంబరాద్రతకు లోఁ నలరియలరి
హాటకఖేటకవ్యాప్తనాటకకూటవైచిత్రి కాదల యూఁచియూఁచి
రంగదంగణనటత్తుంగతరంగవిస్ఫురితమూర్తికి మదిఁజొక్కిచొక్కి

వెడలఁజాలక యమ్మేటిపీటిలోన । గాటమైయొప్పు నొకపూవుతోటనున్న
పొన్నపైవ్రాలి విశ్రమింపుచును గంటి । మప్పుడటక్రింద నొకపూవుఁజప్పరంబు

వ॥ అందు 87

సీ॥ ఘుమఘుమల్ దిలకించు గుత్తంపుసిగచుట్టు బొండుమల్లియపువ్వుఁగండవాని
నడుమఁగస్తురిరేఖయిడిన క్రొన్నెలనామ మలతినామోమున నలరువాని
నిద్దంపుసుప్పాణినిడుదయంటులఁ దేరుతళతళల్ చెక్కులఁ దనరువాని
బంగారుచాయచేఁ బొంగారుపచ్చని జిలుగుదుప్పటము పైఁ జెలఁగువాని
యఱుత గుబ్బతైనపతక మల్లాడువాని బలచనలఁదినసిరిగంద మలరువాని
జేడియలతోడజూదంబు లాడువానిఁ । గాంత కన్నులుచల్లఁగాఁగంటినొకని 88

సీ॥ అతనికన్నులచెన్ను లంబుజంబులకెల్లదిట్టలై చక్కట్లు దిద్దునమ్మ
యతనిచేతులరీతు లభినవామర్త్య మహీజశాఖల నేర మెన్నునమ్మ
యతనిగోరులతీరు లమలకైరవ పలాశావళిదూలఁ బోనాడునమ్మ
యతనిమాటలతేట లతిసుధాధారల ఘట్టించిమిగులఁ జీకొట్టునమ్మ
యతనిచెక్కులటెక్కు లున్నతిపహించు । మించుటద్దంపుజిగి నీసడించునమ్మ
యతనితళుకులబెళుకు లత్యలఘునీల । పాళికలనెంతయును సిగ్గుపరచునమ్మ

మ॥ బిగువుంజన్నులుగాంచిమాను నల జంబీరంబు బీరంబుఁ గ్రొం
జిగిమోముల్గనిసిగ్గునక్కవదలు రాజీవంబు జీవంబు విం
తగ భ్రూరేఖలుజూచిభీతిలును గోదండంబుదండంబు త
జ్జగతీమోహనుమ్రోలనున్న చెలులం జర్చింపఁగాశక్యమే 90

చం॥ వినుమతఁడెంతజాణరొయొ యవేద్యమదీరితజాతిభాష నా
మ్మనముఁజక్కఁగాఁదెలిసి మమ్ముసనీతివినీతివాక్యముల్
దనరఁగఁబల్కరించెఁ బ్రమదంబున నేనునువారిచెంత యం
దొనరుప్రవాళపీఠమున నుండి సుబోధమనుష్యభాషలన్ 96

సీ॥ మొదలఁజెప్పితిని నామూలచూడమున మచ్చారుకులస్వామి పౌరుషములు
అటమీఁద సరమాస్యమైయొప్పఁదెలిపితిఁ గలితయాత్రాయాత కార్యసరణు

లంతఁబ్రసంగిత నతిసుబోధముగ నుపన్యసించితి శాస్త్రార్థంబులెల్లఁ
దదనంతరమున నెంతయు సవిశేషంబుగాఁజూపితిని గానకౌశలంబు
మరియు బ్రహ్మాదిలోకసామ్రాజ్యవర్త। మాన మెంతయుఁ గరతలామలకముగను
విన్నవించితిఁ బ్రమదమావిర్భవింప। నాజగన్మోహనునితోడ నంబుజాక్షి. 92

ఉ॥ అక్కజమైనచక్కదన మారయ వేలుపురాచబిడ్డకుక్
జక్కెర మెక్కజక్కఁగలజాణకుదంట్రిడియతండు కందులే
దొక్కటివింతదానకళ యొప్పన నత్తెరగంటియిూగికిక్
జొక్కపులేడి తేరుగలశూరుని చూలికిఁ దాత మానినీ

వ॥ మెండియు 94

కం॥ పురుషుండాతఁడు కృష్ణుఁడు పురమదిద్వారకయటంచుఁ బొనఁగఁగఁ నొక్కత
త్పరిచారిణివలనంగడు। నెరిగిమహానందభరితహృదయతనుంటిక్ 95

వ॥ అదియునుంగాక మున్ను పెద్దలవలనఁ దత్స్వరూపస్వభావంబులువినియుం
డుదు నతండు లీలామానుషుండగు శ్రీవల్లభుండుగాని సామాన్యుండుగాడు మరి
యును 96

ఉ॥ ఆతఁడు నిన్వరించుటకునర్హుఁడుగాఁదలపోసి నీ మనో
జ్ఞాతతరూపరేఖలపు డన్నియుఁ జెప్పక జెప్పినట్టు నేఁ
జాతురితోనచింపఁ గడునంతసమంది నిజాంబుజాననా
జ్జాతముఖానురాగమున ఛన్నముఁజేసెను దత్ప్రమోదముక్ 97

సీ॥ చక్రపక్షోజ నీచన్నులు సఫలమూర్తులటంచుఁబొగడంగ దొరయునమ్మ
వారిజాతాక్షి నీవాల్గన్ను లతనులక్షణములంచునుతింపఁ జాలునమ్మ
కాంచనసన్ని భ్రూయుగళ నీడుబొమలు రేఖాశాలులనఁ గీర్తిగాంచునమ్మ
కరభోరుయుగళ నీకలికిలేదొడలు భద్రకరంబులన నుచితంబులమ్మ
కంతుజక్కదనంబు జయంతుసొగసు। నలవసంతునివింతయొయారి పంతు
కన్నకొవునేయు నారాయువన్నెకాని। బిగువుకౌగిలి నీవులభించెనేని 98

తే॥ తగినమగవానికౌఁగిటఁ । దనరగల్గు । నలిచికురయౌవనంబది యౌవనంబు
తగినమగవానికౌఁగిటఁ దనరలేని । యలిచికురయౌవనంబది యౌవనంబు॥ 99

వ॥ అని యక్కీరరాజంబు యావదర్థబోధనపై శబ్దహృద్యంబులును ననేకాభిప్రాయసందర్భగర్భంబులును ప్రేమప్రవర్ధమానకౌశలపేశలంబులును సుధామాధుర్యంబులును దయారసాపగాహానమోహనంబులును నైనవాక్యంబు లపరిమితంబుగాఁ బల్కెఁ దత్సమయంబున. 100

కవిరాజవిరాజితము.

వరపరిచారక సంసృతితారక వాంఛితపూరక హేమమయాం
బరపదభారక ధీరచకోరకమండలతారకనాథ సువి
స్తరసవికారక వేదవిదూరక శాస్త్రవిదారక శుభ్రగరు
త్సరసిజకోరక సింహకిశోరక సౌష్ఠవవారకచారు ముఖా 101

గద్య.

ఇది శ్రీమద్రామానుజభాగినేయకులసార్వభౌమ శ్రీమన్నల్లనాచార్యపరిచర్యా
ధుర్య చెన్నకేశవాచార్యపుత్ర తిరుమలాచార్యపౌత్ర గౌతమ
గోత్ర సింహాద్రి వెంకటనామధేయ ప్రణీతంబైన
మహాప్రబంధ చమత్కారమంజరీ
కోరకాయితంబగు ద్వితీయా
శ్వాసము.

---



# చమత్కారమంజరి.

—:[o]:—

## తృతీయాశ్వాసము.

---

కం॥ శ్రీనిలయపాదభక్త స । మానాధికవహితమోక్షమంత్రీకృత ని
  త్యానందావహశుభ రా । మానుజనిజనామధేయ యతికులతిలకా॥ 1

  వ॥ అవధరింపుము. 2

ఉ॥ అవనితాశిరోమణియు హర్షమిగుర్పఁగఁబల్కెఁజిల్కతో
  నీపటకేగువెన్కఁ దరుణీజనముల్ గొలువంగ దంతపుం
  జావడిమీఁదఁ గుందనపుజంత్రముమీటఁ దదీయతాళశి
  క్షావిధి కాడిన బైడమకన్నదరంబలుమారు నంతటన్. 3

సీ॥ వాతపోతక సమాధూతపింగళజటాఝూటసౌదామినీసముదయంబు
  రమణీయతర రమారమణీరమారమణానుభవాశ్రు పయఃకణములు
  గతిరణద్వల్లకీకాండసంఘటితాభిరామ కోమలకృష్ణనామదర్భ
  ఖండనాఖండితతాండవోచిత చామరాంకమిళద్బలాకావళియును
  మెండుకొనిమింటదుగ్ధాబ్ధిదండనుండి । నీరదముబోలెఁజనుదెంచె నారదుండు
  బహుళతనుకాంతినిర్జిత పారదుండు । సకలవేదాంతవిద్యా విశారదుండు. 4

కం॥ వచ్చిననంజలియిడినే । నిచ్చినయర్ఘ్యాదికమున కెంతయుమదిలో
  మెచ్చి వరుఁడెవ్వఁడనుచున్ । దెచ్చిప్రసంగంబుఁ జిత్తధృతినిట్లనియెన్. 5

కం॥ ఓకాంత ద్వారవతిలో । శ్రీకృష్ణుఁడనంగఁ బురుషసింహుండుగలం
  డాకారవిజితమకర ప । తాకుఁడువిభవానమిత శతక్రతుఁడెన్నన్ 6

చం॥ అతనివరింపవేనిజలజానన నీ యకలంకవిభ్రమా
న్వితమగురూప మబ్ధిఁబ్రభవించినవర్షమురీతినిష్ఫలం
బతనివరించితేని జలజానన నీ యకలంకవిభ్రమా
న్వితమగురూప మించునజనించుఫలంబయిరొప్ప నెప్పుడున్ 7

తే॥ శుద్ధవిజ్ఞానయోగదక్షులము గాన । మా కెఱుంగనియదిలేదు లోకములను
ధరణిలోఁ గృష్ణు డేనీకుఁ దగినమగఁడు । పడుచ యిదినమ్ము మాతండ్రిబ్రహ్మయాన

చం॥ కమలదళాక్షి కృష్ణుబిగిఁ గౌఁగిటఁ జేరఁగఁగల్గుపన్క సాం
తముగఁగ్రహించి యిద్ది వివిధంబుగఁ బాడుచుఁ బ్రొద్దుపుచ్చుమం
చమరఁగఁ బ్రాసియిచ్చెను దదంకసనంకలితాత్మవాక్యదం
బమునఁ జెలంగుగీతము ప్రబంధమునుం గరుణాసమగ్రతన్ 10

వ॥ ఇట్లనేకవిధంబులనాదరించి యమ్మునిపుంగవుండంతర్హితుండయ్యె నేనును
దద్వాక్యంబులువిశ్వసించికృష్ణయుక్పరణాలాలసమానసనై భవదాగమనంబు నిరీక్షింపుచుం
డనీవును వేగుదెంచి తదీయపాణిగ్రహణంబె బోధించితివి 11

కం॥ మేలిది రోగియు వెజ్జును । బాలే కోరినవిధంబు పాటిల్లుచు నీ
వేళకు రెండొక్కటియై - చాలమనోమోదనంబు సాగించెఁ జామీ 12

వ॥ అనిన విని యక్కీరంబభినందించి 13

కం॥ ఈతరినినిట్టికార్యము । భూతలపతి కెఱుఁగఁ జెప్పఁ బోవలయు "మనః
పూతంసమాచరే" త్తన । నోతరుణీ వినవె వార్త యుర్వీస్థలిలోన్ 14

కం॥ అనిమరియు రాజుపాలికిఁ । జనితద్వృత్తాంతమెల్లసరసోక్తులచే
వినుపింపనిట్లు నేఁజె । ప్పనిపనిఁ జేసితివటన్నఁ బరమప్రీతిన్ 15

కం॥ గణనాగోచరసముచిత । ఘణనాకార్యంబుఁ జెప్పఁ బట్టదునీకున్
మణిజాతికిఁ గాక నభో । మణికి మెఱుంగిడఁగవలెనె మదినూహింపన్ 16

వ॥ అనిమరియు. 17

తే॥ దండియగువిల్లుమత్స్యయంత్రమును బెట్టి । యిద్దివో పెట్టి యీయంత్ర మెవ్వఁడేని

చం॥ చెలులను తెప్పలన్ విరహసింధువులీఁదెడుమమ్ము బోటులన్
జలమునమ్రింగుతోయనిశసంభవు వీనిని జూచి పద్మజుం
డలికచలార యాహిమకరాఖ్య తగన్ మకరోపమయన్న మేల్
తలఁపునఁబెట్టె నట్టినయతత్త్వవివేకికి మేలుగావుతన్ 36

తే॥ వేమరోఽవర్మ్మణై వప్రపలీయతే హియ । టన్నది నిజంబు రాత్రి మహాఖిలమున
బలియుఁడై పాంథజాతరూపముహరించి । శ్వేతకరుఁడయ్యె నీయంబుజాతవైరి

వ॥ ఇట్లు శోకవిషంబున నయ్యరవిందాక్షి యిందునిందనసందర్భంబు లొనరింపుచుఁ
దన్నిశోపద్రవంబుగడుపుచుండె నంత 38

శా॥ జోకన్ వీడ్కొని చుక్కరేఁగెను జుమీ శుభ్రాంశుబింబప్రభో
త్సేకంబుల్ దరిగెన్ జుమీ కడకువచ్చెన్ జుమ్మి యీరేయి చిం
తాకాలుష్యము లేల బాలమదిలో ధైర్యాంబ వార్యంబుగాఁ
గోకోయఁగతిఁ గుక్కుటంబులరచెన్ గోకోవిరావార్భటిన్ 39

సీ॥ కుముదినీవల్లికాసమితికి జోకొట్టు తలఁగు జక్కవలసంధానకర్త
నెత్తమ్మికల్కికన్నియకు వేడుకకాఁడు రతినాథజనకుని రచ్చగద్దె
చంద్రికాపాయికంచంబులోపలిరాయి కౌశికావళికిఁ గన్మూసిగంత
సంతమసములకుచ్చాటనమంత్రంబు భువనంబువారియుప్పొంగుగన్న
జారిణులకాలిసంకెల జనగణాక్షి । పుటసమీక్షణములపాలిపుణ్యతీర్థ
మరుణుఁడుదయించెనరుణాత్మకిరణుఁడగుచుఁ । బూర్వభూధరశేఖరాభోగమునను

చం॥ క్రమమునమిత్రమండల మఖండితపండితధామభూమచేఁ
గొమరువహించెఁ బూర్వగిరికూటమహోన్నతపీఠవాసియై
యమరకులాధినాథసముదంచితపట్టణసౌధపాళిపై
నమరెడుకుందనంపుగడియారపుగంటయనంగ నెంతయున్ 41

వ॥ అంతసంతాపమార్పనీడయగు నొక్కప్రౌఢ పెద్దయుంబ్రొద్దు పరితపించిన
యమ్ముద్దియకుఁ జంద్రాస్తమయమహాసంతోషవార్తవిన్నవించినఁ దదాలింగనంబుపా
రితోషికంబుగాలభించి నమ్మికతో నంతనంతఃపురంబు వెడలఁదోతెంచి చెంగటనసంగ
వశ్యంగకురంగాంకమణివేదికోత్సంగంబున నధివసింపంజేసి మరియును. 42

చ॥ మగుడక యశ్రుపూరముఖమజ్జనమాఁగి సుగంధవారిచే
మగువయొకర్తొనర్చె ముఖమార్జనమున్ ముడిగట్టియొక్కఁతన్
మొగమున వ్రేలుముంగురులు మొల్లపుబొట్టెడలించియింతికిన్
ధిగధిగలీనుబొట్టొకతెదిద్దె బళీయనఁ బచ్చికస్తురిన్ 43

వ॥ అప్పుడు 44

సీ॥ కొమ్మపల్కెడు వలయంబులుగొమ్మంచు నెదయందువలయమ్ములిడియెమరుఁడు
నీలోర్మికలుచాలఁగీలించెదుమరుండుకంటను నీలోర్మికలుఘటించె
వలదుముక్తాహారకలన నాలుకనె యంగజుఁడు ముక్తాహారకలనగూర్చె
నందియలాననర్థమె మన్మథుఁడు వెన్నునందె తా నందియలానఁదార్చె
వింతసింగారమిప్పుడో వెలదినాకు । గలిగెనిఁక నీవు సేయు సింగారమెపుడు
నున్నదియె కాదెయనుచునక్కన్నె చెలులఁ । గ్రమ్మఱింపుచు ధైర్యంబు గ్రుమ్మరించు

సీ॥ గంధమా యిట్టిలాగంధమా యుత్తరిగంధమా యిది యంగకములనలఁద
వీడెమా యాప్రేమవీడెమానిని మాన వీడెమన్మథవేధ కెన్నొకటి
కప్పురమా మూర్ఛగప్పురమాజాని గప్పురమానంగఁ గల్గుదనుక
దండలాడఁగదీరదండలా యివి మానదండలాంఛనములై మెండుకొనియె
ననుచుఁ గడునుస్సురని వడయడరనూర్చి । యువిదకన్నీరుగ్రుక్కుఁదన్నుపచరించు
దిట్టచెలులెల్ల మగనిపైనొట్టుపెట్ట । గడగడవడంకి యిసుమంతగడువలేక 46

వ॥ ఇవ్విధంబున మన్మథవేదనంగృశింపుచు నొక్కనాఁడు 47

తే॥ బోటులనొకింతతనుఁబాసిపోనికూర్మి । బోటులమెఱంగి తెకతెకఁబొక్కిపడెడు
నొంటి వలరాచకింకకునోర్వలేక । నొంటిఁజని మదిసాహసంబూనిపూని 48

మ॥ చెలి యారామముఁజేరి ప్రొద్దుగఁనుపంజింతించి కంసారిపైఁ
గలగీతంబులుపాడఁ జాగియపుడుం గన్నీటిమున్నీటిలోఁ
బలవంతంబగువీతశోకాయలపసన్ శైఁదేలఁబుష్పేచ్ఛ శా
ఖల మున్నెక్కుప్రియాళిఁ దా దిగిచె దీర్ఘస్వోత్తరీయంబునన్ 49

వ॥ అంత 50

తే॥ నెచ్చెలులుగొంద అరసి యున్నింట నింట । బాలఁగానక విద్రుమపంజరమున

నున్న నున్ననిజిగిచిల్కవిన్నవించు। వలన వలనంది యటంబోయి వనితఁగాంచి 51

సీ॥ పంచబాణుఁడుమండిపడు జందురుఁడు చాల హెచ్చితంౘడిక్రీఁబోటుదెచ్చు నెపుడు
తపురకంబుఁ జైత్రుఁడేమఱఁడు గంధపుఁగొండగాలి విగ్రహబద్ధకంకణుండు
కోయిలల్ పంచమగుణమువీడవు మూకఁగూడి చిల్కలు పండ్లుగొఱుకుచుండు
నళిసమూహమ్ము రంధ్రాన్వేషణముసేయుఁ జేర్చి యీవనవాటి పెచ్చుపెరుగు
నింపఁటికి నిట్లు నీమర్మమెఱుక పడఁగఁ। దొడరి బయలేలవెల్లితో తొంగియున్న
సుంకరీ! తలమూటకుసుంకమెంత। యనుట యిటవమ్మ చెలి మోసమగుఁ గదమ్మ

ఉ॥ ఈతటి నీదు ముక్కు మొగమింతయుఁజూడక గంధబంధురం
బై తెగి యేఁచుఁజంపకము లంబుజముల్ తమి నుబ్బు నుత్పల
వ్రాత మెదిర్చి పేర్చుఁ బెనువంతలు నీకనుఁగాయకే మహో
త్పాతపుఁదేంట్లు నల్గుఁ జెలి! తథ్యము నీతలఁ జూపకెంతయుఁ 53

కం॥ ఇచ్చటమ్మదుబిసఖండము। లిచ్చటఁదిననంచగమికి నిది సమదం బౌ
ముచ్చటయంతయు నేలా। ముచ్చట విరహిణులమానమున కోతర్కక్షి! 54

కం॥ అల మధుపాదులదోసమె। తలకొను సుమనోగణంబు దానికి నిచటన్
వలదుపద సాధురేగినఁ। దలపొలమున నుండరాదు తామరసాక్షి! 55

వ॥ అనియిట్లుదూరిన బెట్టిదంబగునిట్టూర్పునిగుడించి 56

కం॥ మాటకుమాటకుసంతత। మాటకుఁబెట్టుదురుసకియ లని మిముఁవిడి యా
పాటలసురభితవనిఁబతి। పాటలఁ బ్రొద్దుచ్చఁజెందఁబడెఁ జెలులారా! 57

వ॥ అనిపల్కి వారితోడఁగూడుకొని 58

సీ॥ అంకజోర్మిష్ఫలత్పంకజోత్కరములఁ దేటిచూచి మొగంబుఁ ద్రిప్పిత్రిప్పి
సవలయక్రమచలత్కువలయాచ్ఛచ్ఛదశ్రీఁ గాంచి కన్నెఱ్ఱఁజేసిచేసి
కంపకాంతనవీనచంపకార్గళనూనవిషరముల్ గని ముక్కువిఱిచివిఱిచి
ఫుల్లవాతోద్ధూతపల్లవాటోపముల్ వివరించి మిగులఁ జేపిచిపిచి
మగువ చక్రగతులు మావులు పున్నాగ। ములును మధుపతతులు మొనయువనము
డింపవెడలెను "శకటంపంచమాస్తేన," । యను నెడువచనమరయ నర్థముగదె? 59

వ॥ ఇట్లు శృంగారవనంబు వెడలి సుందరి నిజమందిరంబుఁ జేరి సఖులు శిశిరోప
చారంబులు సేయుచుండ శుకాగమనప్రతీక్షాపరాయణయై యున్న సమయంబున 60

చ॥ శుక మరుణప్రభాపటలశోభితవక్త్రపుటాభిభూతకిం
శుక మతిచిత్రపత్రపరిశోచితవృత్రవిరోధికార్ముకాం
శుక మసదృక్షమంజులవచోలహరీపరతంత్రకాంచనాం
శుక మరుదెంచి నిల్చెఁ గడు జోద్యము నొంది! సఖుల్ నుతింపఁగాన్ 61

వ॥ అంత 62

సీ॥ నడుమ నాలస్యమెంతయు లేక ద్వారకాపురికి రివ్వున సాగిపోతినమ్మ
పోయి క్రొన్ననసెజ్జఁ బొర్లుచు విరహాగ్నిఁ గ్రాగెడు మురవైరిఁ గంటినమ్మ
కని "మహాభాగ! సంకల్పసిద్ధి" యటంచు నెలమితో దీవనలిడితినమ్మ
యిడి మాలతాంగి నిన్నెదఁ గోరి పూవింటిదంటచే సగమైనదంటినమ్మ
యని ప్రయాణమిటకు నపుడె యంతయు సమ । కూర్చి యతని వీడుకొంటినమ్మ
కొని ఫలించె నీదు కోరిక లని పొంగి । బాల! యిటకు నుట్టిపడితినమ్మ 63

వ॥ అని మఱియు బహుప్రకారంబులఁ బలికిన 64

కం॥ బాగుగ నాలింపుచు శ్రీ । భ్రూగతి శుకవదనకింశుకాంచితహరివా
ర్తాగురుమధుతర్పితహృ । ద్భాగభ్రమరేంద్రయగుచు బాలిక యుండెన్ 65

వ॥ అంత 66

సీ॥ అంగవంగకళింగ బంగాళముఖ బహుదేశ విశ్వంభరాధీశ్వరులును
లాటమరాట కర్ణాటభోటావంతి భోజకాంభోజాది భూమిపతులు
చోళనేపాళ పాంచాళమాళవగౌళ కొంకణటెంకణ క్షోణివరులు
గాంధారసింధు యుగంధరాంధ్రకరూశ పాండ్యకేకయ మహీపాలకులును
దుంగమాతంగనివహ తురంగగణ శ । తాంగసముదయసంగరాభంగపదగ
జాతనూతనకేతనచ్ఛత్రచిత్ర । హేమపల్యంకికాందోళికాఢ్యు లగుచు 67

కం॥ వచ్చిరి యప్పురి రాజముఁ । జొచ్చిరి తన్మిత్రజనులు సువినయములతో
నిచ్చిరి విడుదులు వారికిఁ ॥ దెచ్చిరి సకలార్థములను దృఢసంప్రీతిన్ 68

సీ॥ మారాజ్ఞ చే నెంచఁ దారలతో వచ్చు చంద్రుఁడై మౌక్తికచ్ఛత్ర మొప్ప

లలిఁ జీరుకొనివచ్చులక్షణగారాబురాయంచలనఁ జామరంబు లెసఁగ
మాద్రీగళము తమ్ము మదమార్చ మొరపెట్టుకరణిగా ధవళశంఖములు మ్రోయ
నిఖిలదిగ్దేశావనీపాలకుల నెల్లఁ దలఁగుమన్నట్లు కేతనము గదల
వందిమాగధగీతములు నందడింప। గాఢగంధాంధ సింధురారూఢుఁడగుచు
నప్పుడే తెంచె నిజచరణాబ్జభక్త। రంజనుండగు నమ్మురభంజనుండు 69

వ॥ ఇట్లు సర్వసన్నాహంబులతోఁ బురంబుఁ బ్రవేశించి భయభక్తియుక్తుండగునారాజుచేబహూకృతుండై సుఖంబుండె నన్యరాజులును మజ్జనభోజనాద్యుపచారంబుల విశ్రమించి యంత శిబిరంబులు వెలువడి యక్కన్యాపవిత్రాచరణానుసరణంబున యుగపదనంతావతారుండైన పంచబాణుని నిజమూర్తులోయన నాగరనాగరాజగమనలక్షయంబగున పేక్షాతిశయంబున వీక్షింప మూకలుమూకలై బృహత్సేనమహీవల్లభుని హజారంబునకుంజని యందు 70

శా॥ శ్రీమంతుల్గనిరంతః దన్నగరయోషిద్రత్న వేశచ్ఛల
శ్యామాహీశ్వరకన్యకామణిమహస్సమ్యగ్దిదృక్షాభర
స్థేమాయాతభుజంగపుంగవుఁడనం జెన్నొందు తచ్చాప ము
ద్దామాటోపము సాక్షత ప్రసవగంధప్రోల్లసద్ధూపముక్ 71

వ॥మఱియు 72

సీ॥ చూచి ముట్టకయె సంకోచించి వెసవెసజారెఁ బరాకుగాఁ గేరళుండు
ముట్టికదల్పఁగా మురు వింతయునులేక నలుదెసల్ చూచె గాంధారనృపతి
కపిలించిరెత్తఁగాఁ గడునశక్తుండయి గిజగిజకుడిచె నక్కేకయుండు
ఎత్తి దాఁపలి కేలహత్తించి నిల్పఁగానోపక తలవంచె హూణభర్త
నిల్పి మోపెట్టఁగాలేక నేర్పుమాలి। నారిఁ గేల్ద్రెవ్వఁబడియెఁ గర్నాటకుండు
తివిచి మోపెట్టి శరముసంధింపలేమి। బెట్టుకిచకొట్టె నప్పుడా రట్టవిభుఁడు 73

కం॥ భీముఁడు కర్ణుఁడు కౌరవ। భూమీశుఁడు తోయమధ్యమున ఝషయంత్రం
బేమఱకచూచిచూచియు। నేమియుమతిరోయుఁగనుఁడి రిదియెట్లనుచున్ 74

ఉ॥ ఆ సలిలప్రమేయ ఝషయంత్రము మర్మమెఱింగి యస్త్రశి
క్షానువిదగ్ధులైనవిలుకాండ్రికమేటి కిరీటినూటిగా
నేసినకోల దాని కొకయించుక చేరి కదల్చి ఖండముల్
చేసియెసంగలేక తపచిత్తముఁజేసె నఖండఖండిమన్ 75

వ॥ అప్పుడు సింహాగమనవిలాసమునం జను దెంచి కోదండంబు హస్తదండంబునం ధరించి.

ఉ॥ బంగరుదుప్పటంబు వలెవాటుగ నొప్ప హసన్ముఖాబ్జుఁడై
రింగున నారిఁగోలసవరించి తటాలున ద్రుంచె నాధను
శ్చంగుఁడు గోపయావతభుజంగుఁడు మోచితసంగుఁడుం గృపా
పాంగుఁడు దృప్తదర్పభరభంజనమంత్రము మత్స్యయంత్రమున్ 77

ఉ॥ భోరున దుందుభుల్ మొరసెఁ బుష్పమయంబగువర్ష మంతటన్
జోరున వెల్లిగాఁగురిసె శోభనసౌరభరాజమానమై
దాఁగనవచ్చివీచె సముదార సుశీర సమీరపోతముల్
హోరన సన్నుతించె నవు డుర్విజనాళి తదీయశౌర్యముల్ 78

సీ॥ అలికరేఖారంజనార్ధ వేధఃక్లృప్త కోమలాంజనమయ గుళికలనఁగ
రంగ దురోజరథాంగపుంగవ సముత్క్రాంచిత ఘన గరుత్కోటియనఁగఁ
జరణద్వయీప్రోక్త తరుణాబ్జ తల్లజ పల్లవాక్షేపణార్భటికయనఁగ
సాక్షాత్కృతానంగచారుమోహనశక్తి పరిణత యువ కంఠపాశమనఁగఁ
గర్ణకువలయలోలభృంగములు తాళి। వృంతపవనచలోత్తరీయాంత మంఘ్రి
కటకరవములు హస్త సంగ్రథితమాల। చెలఁగ నేతెంచె లక్షణచెలులతోడ 79

సీ॥ శార్వరీతరుణి నక్షత్రమాలిక చేత శీతమయూఖుఁ గైసేసినట్లు
గంగ పాండురతరంగంబుచే నాపగాధీశున కొకవన్నెఁ దెచ్చినట్లు
మధుసంపద లతాంతమంజరిచే ధరిత్రీజమాళి నలంకరించినట్లు
ప్రాతస్సమయలక్ష్మి భానుచ్ఛవిచ్ఛట నుదయాద్రి కొకశీవి యొసఁగినట్లు
బాలికామణి యవ్వనమాలి కంఠ। భాగమలరించె మహితానురాగ మొప్ప
లోకజనగణ గురుతరాలోకములకు। భ్రామకంబగు నమ్మణిదామకమున 80

ఉ॥ చందనగంధి వెక్కసపుఁజన్నుల చెన్నుఁ బిఱుందుపొందుఁ గా
నందముఁ జూచి కొండఁగొనిన ట్లఖిలావని యేలురీతి మి
న్నందిన భంగి నంచసుతుఁ డుండె నమందతరాతినిర్మలా
నందముమున్న కూర్మి భృగునందన వామను లైనతద్గతిన్ 81

వ॥ అంతటఁ బరమానందభరిత నిజస్వాంతుండగు బృహత్సేన మహీకాంతుండు మౌహూర్తికశ్రావిత తాత్కాలిక వివాహముహూర్తుండై తన్ముహూర్తంబు నిజపురోహితవర్గంబుచే గృష్ణున కెఱింగించి పుత్రసహితుండై నిజమందిరంబునకుంజనియెనంత శ్రీకృష్ణుండును సకలజనజేగీయమానుండై నిజ శిబిరంబుఁ బ్రవేశించి నిజామాత్యవర్గంబునకు బ్రాహ్మణసమారాధన ప్రయత్నంబుఁ గావింప నియోగించి పురోహితప్రేరేపణంబున మంగళస్నాన సన్నద్ధుండయ్యె నప్పుడు. 82

సీ॥ అంగసంభవుఁడు చన్బొంగరంబులచుట్టునిడు జాలెలన సరుల్ మురిపడంగఁ
గటకతాళ కుచోరునటనమెచ్చినలీల వెడఁదవేనలి పుష్పవృష్టిగురియ
వడవడమను కౌనుజడుపుఁదీర్చెడుభంగి మొలనూలిచిఱుగంట లలరిపలుక
నూర్పుతావికిఁజొక్కియొరఁగుతేఁటులవఁగ ముంగురులు చెమ్మటనొనల్ గూడనంట
నమర శిరసంటె నొక్క ప్రాయశ్శిరోజ, యొకతె నైర్మల్య గంధామలకము వెట్టెఁ
గించిదవలగ్నయొకతె యర్పించె జలక, మొక్క యుచ్చైర్ణితంబతళ్లొత్తెహరికి 83

తే॥ జిలుఁగుమడుఁగులు సికిగండమలరుదండ, లొరపునూనికములసొమ్ము లొసఁగి ఫాల
ఫలకతలమున మృగమదతిలక మలర, దిద్ది ముందరనిడెనిల్వుటద్ద మొకతె 84

శా॥ భ్రూరేఖోజ్వలనాసికాపుటముతోఁ బొంకంపుకస్తూరిబొ
ట్టారూఢిం జవరాండ్రఁగుమ్మ మదనుండార్జించుమేల్భంతిపో
లై రాజిల్లఁగ నప్డు దైత్యమథనుం డద్దంబులోఁగాంచి యా
సైరంధ్రీమణి బ్రేలికిచ్చె మణి విస్ఫారోర్మికారాజముల్ 85

వ॥ ఇవ్విధంబునం బుండరీకనయనుం డలంకృతుండై నీరాజనంబవధరించి పళ్యజ్జన నయనానందసంపాదియగు నొక్క వేదికకుఁజని మేరుశిఖరిశిఖరశాసనంబగు కనకాసనంబునధిష్టించి తత్కాలోచితవిధినుండై నప్పుడు 86

సీ॥ ఒగిఁ దేనెతోనలిడ నొజ్జలకివిదర్భపీఠంబులని చంకఁబెట్టువారు
వరుస మండెంగలువడ్డింప జపతిత్రిమడతలోయని విప్పఁగడఁగువారు
వడలు వైట్టిన బ్రేలనిడి యొంతిలేసిజందేలబిళ్ళలటంచుఁ ద్రిప్పువారు
పోక పేరులొనంగఁ బొంకపుఁజపసూత్రవలయంబులని మెడ వైచువారు
నగుచుహరిశోభనముఁజూడనరుగుదెంచు, మునివరులయొద్దివేవేలముగుదశిష్యు
లంగఁబుభుజించిరి చతుర్విధాన్నములను, వేడ్కలుప్పొంగ వెన్నునివిడిదిలోన 87

వ॥ ఇట్లు భుజించినవారల గంధపుష్పాక్షతతాంబూలంబులం బరితృప్తులం గావించి వారలయాశీర్వాదాక్షతంబులు గైకొని యా నందనందనుం డమందానందంబున శ్వశురప్రేషితభావుకప్రేరితుండై నిజనియోగానహంసంబునం జనుదెంచు దెలిదీవియనవాప్య వజ్రరథం బెక్కి నిజకన్యకాపరిణయదుర్ణయకలుషితాంతరంగతరంగిణీవల్లభప్రేషితులై చనుదెంచి చెంగట మెలంగు మంగళపాఠకుల సంగీతప్రసంగభంగీసౌభాగ్యంబు లాకర్ణించియు నట న్నటీపటీరగంధి తటిద్వల్లికామతల్లికాభినవప్రభావిభవంబు లభివీక్షించియు శేషవంశతాప్రయుక్తవచనకౌశలంబున నైసర్గికపరుషరవంబున నయనంబును భయంబును జూపుటమఱచి యపారపారవశ్యంబున శిరఃకంపంబును మందగమనంబునుం బొందిన భుజంగపుంగవులను జీమూతసార్వభౌములనం బనుపడిన పటుతరధ్వజంబులును దనకు మక్కువమగండగు నక్కమలాక్షుం డొక్కెడ మొగిడి బెక్కుచెలులకు నక్కజంబుగాఁ జొక్కి తను లెక్కసేయండని యుల్లంబగిలి మిగులం బొగలుపుడమిపూఁబోఁడి మేని వేఁడిమిం బోలె మిట్టిపడినట్టు కొట్టక చౌపట్టంబులుఁ ద్రొక్కు నారట్టహయంబులును నాగరనాగ రాజితగండమండలా మందనిష్యందమాన మానిత దానపయఃపూరనిర్వాపణకుల్యాకార సాకల్యాకల్య నేమిరేఖా పావకంబులగు రథంబులును నిగనిగలు దేరు తిన్నగరిమగువల నగుమొగంబులకు గొప్పలై యొప్పు నమృతపుఁగుప్పె లప్పనలుగాఁగొని యొప్పింపనేతెంచు చంద్రమండలంబులోయన నబ్బురంబగు ధవళచ్ఛత్రంబులును, ననవద్యహృద్యవాద్యఘోషాతిశయబధిరీభూతులై చేష్టావిశేషంబుల నేపథ్యంబులు వైచి మేడలపై దర్శనక్రీడలనున్న ప్రోడచేడియల నిడువాలుచూపులు మణితోరణంబులని పుటంబెసె యందుకొనం గమకించువీరభటులును, జెలంగ మందమందగమనంబున రాజమార్గంబున నేగి యేగి రథంబుడిగ్గి మణిపాదుకలఁ ధరించి రాజముఖ్యదత్త నీరాజనపూర్వకంబుగాఁ జంద్రశాలాకదంబితచందిరంబగు తద్రాజమందిరంబుఁ బ్రవేశించి శుభాలంకారంబులప్రోదియగు వివాహవేదిం జేరి యుభయపార్శ్వనివిష్టవేదపాఠకంబగు కనకపీఠంబున నధిష్ఠించె నంత ౪౪

సీ॥ చికిలిరైదోనసొచ్చుచిత్తజుశరమునా మంగళస్నాతయై మడుఁగుఁగట్టి
చనుఁగవమించెనాతునియుఁగొనసురీతిఁ దగటి మేల్రవికె గుత్తముగదొడిగి
సిరిచూపిసలరాజుచేఁ గనకస్నానమొంద్ధుపొందున సొమ్ములందపఱచి
వాఁరిఁబొందుమని మరుండంపుచీట్లనఁగ గేదంగిరేకులఁ జాలఁ దల ధరించి
నీలకబళితనవతృణలీలనలర । గన్నుఁగదనంజనము రేఖగాఁగఁ దీర్చి
బలియుజడఁ ద్రొక్కికొనుశంకబలెనెవచ్చె । మందగతియొప్పఁ జెలులతో మద్రకన్య॥

సీ॥ సారెసారెకు దంతచకచకల్ బయలెక్కి తీవి దిక్కులఁ బల్లటీలుఁ ద్రొక్క
వీడెంపుఘుమఘుమల్ గూడినవదనగంధంబు క్రొవ్వు వసంతంబుఁ జిల్క
నగ్గలంబగుకల్కిసిగ్గులఁ లోచనతోయజంబులునిండి తొంగిచూడ
రమణమాటుగనున్నరతనంపుమొగరంబు డంబుగా నవలఁ గొండెంబు సెప్ప
మంత్రసరణులుంతడబడ మరచిముసలి యొజ్జబాపలునాలింపఁ బజ్జఁ జేరి
కంచుఁగీసినతెఱఁగున ఖంగురనఁగఁ జేడియలుగూడి ధవళముల్ పాడుచుండ 90

కం॥ మధుపర్కపూర్వకముగా మధుహల్లకభల్లకోపమానుండగు న
మ్మధుమథనునకర్పించెను మధురాధర నవనిపాలమండనుఁ డంతన్ 91

సీ॥ చనుఁజక్కవలను నిశ్చలమైత్రిఁ జూడంగ వ్రాలినహేళినాఁ దాళిఁ గట్టెఁ
ఎమక మేర్పడఁ గందుతరుణీధరణిఁ జిక్కు బలునుబ్బునాఁ దలఁబ్రాలొసంగె
నింతితోడను గంతుఁ డేచినముచ్చటల్ జెప్పెడుభంగిగాఁ జెట్టఁ బట్టెఁ
గుంభిని నీకాలి గోరుఁబోలఁగ లేరుపడతులన్నతి సప్తపదములాన
వీరపానంబు చేగారవించి హృద్గతాత్మభవవహ్నికిం బ్రతియనుపుకరణి
నాజ్యముఖహవ్యములు వేల్చి యంత వహ్నినాత్మనారోపణముఁ జేసె నచ్యుతుండు

వ॥ అప్పుడు సంతుష్టనిజస్వాంతుండగు బృహత్సేనమహీకాంతుం డల్లుండగు వల్లవీవల్లభున కనేకదివ్యాంబరమణిభూషణాదికంబు లరణంబులుగా నర్పించి యసాధారణంబుగా మతీయును. 93

లయగ్రాహి

తుంగము గళన్మదతరంగము కపోలచలభృంగము హతారిచతురంగమును గాభ
ద్రాంగము జవానిలకురంగము మహానటనచంగము జితోగ్రరణరంగమును గా ని
ర్భంగము ధ్వజోన్నతపతంగము సకార్ముకనిషంగము తటిచ్ఛయపిశంగమును గా మా
తంగమును బారసితురంగమునుఁ గాంచనశతాంగమును శౌరికినొసంగె నృపుఁ డంతన్

మ॥ ప్రియమొప్పారఁగ నక్కుశేశయమనోహృన్మండలంబుల్ బితే
శయరాట్కుండలముల్ సుఖాప్తి మరపింపం జాలునా నిచ్చె నెం
తయు నేకాండములై ధగద్ధగలు చిందన్ గెంపుతాఁ బేటి క
ద్దియయుల్ దంతపురచ్ఛబల్లయు ధరాధీశుండు దైత్యారికిన్ 95

వ. అట్లు బహూకరించి. 96

కం. అల్లని రుచిజితసుమనో । భల్లుని కోదండచండబలహతమధురా
వల్లుని ప్రణమన్మిథ్యా । భిల్లునిఁ దనచిన్నకూర్మిబిడ్డను బంచెన్ 97

వ. అంత.

ఉ. నందితకుంభజాచుఁ గంజనయనామహిత గోత్రాల్కని కిరప్రకాశిత
స్యందనమెక్కి గొబ్బెనహరి శంఖము తారగిరీంద్రలోచనా
నందనట త్తటిస్ఫుపఘనాఘనపోతము గర్జజాకఁ జె
న్నొందినయట్లు నాగరు లహో యని యెంతయు సంస్తుతింపఁగన్. 98

ఉ॥ ఇత్తఱి రాజపుంగవుల నిందఱు నేరనియొక్క నేర్పుచే
సత్తుగయుంత్రమేసి యులజవ్వనిఁ గైకొని శౌరిపోం దెంద్రా
ను త్తమకీర్తి వేగ నిపుకుస్థలిఁ నరికట్టమేని నీ
మొత్తన యోను దీనవు నమేయయశం బగు నంచు నీర్ష్యచేన్. 99

తే॥ ఒగినుహావని వరపతంగోత్కరంబు। కృష్ణవర్త్మానుగమనమై కేరలెనప్పు
డొగిమహావని వరపతంగోత్కరంబు కృష్ణవర్త్మానుగమనమై కెరలినట్లు. 100

సీ॥ కాంభోజగణమెల్లఁ గాంభోజగణమయ్యె యదుకుంజరుం డేచి పొదలుచుండ
నామరాటుండు దా నామరాటుండయ్యె నెదురుపోటునఁగృష్ణుఁ డదననొంప
మాలవుండప్పుడు మాలవుండయ్యెను వెన్నునిబలమొంచి విన్ననగుచుఁ
దలఁకివిదేహుండు తా విదేహుండయ్యె హరి వాలు జళిపించినదియొచూచి
సింధులంచటు కటకటా! సింధులైరి । కొ)త్తనిజదేహరక్తముల్ కెరలిపారలఁ
జాళఁగాలేక చోళులు చోళులైరి । యడవిఁబ్రచ్ఛన్నవృత్తిఁదామథివసించి. 101

చ॥ హరికరవాలజాలనిహతాహత రక్తఝురీకదంబముల్
కరిపరకైతవాంబుద నికాయగళన్మదవృష్టిఁబొంగ వే
యరిగెలుపుట్టుగాఁగ నదియమ్మెయి బల్లెపుఁబ్రొద్దులూని త
త్తరణముఁజేసి శేషవసుధావరవర్గము వాటె భీతిచేన్ 102

శా॥ భోగ్యుద్ధానితరాష్టకంటకిత నాభీదఘ్న మేదోమయ

ప్రోద్యత్కర్దమదుర్గమాజిసరణిం బోలేక తద్భూచరుల్
హృద్యంబౌ మరమంత్రము మింటఁ బటుఘోటీంధాన రింఖాకృతా
చ్ఛేదోర్వీరజమెచ్చఁగా ననిమిషుల్ చెల్వొంద్రు మర్త్యత్వమున్. 103

సీ॥ శస్త్రారిమస్తకప్రస్తదీర్ఘోక్షీణపటలముల్ బంతిచాపలుగ వైచి
సంభిన్నరిపుకుంభికుంభముక్తామణి పారంపరలఁ బీటపట్లు పెట్టి
నిర్మూలితద్విపనిర్మలాయతచర్మఫలకముల్ పట్టెరంబులుగనిలిపి
యాలూనవైరిభూపాల కపాలముల్ చేగిన్నియలుగ నచ్చెంతనునిచి
మించిమాంసంపువిందు వడ్డించెనపుడు । డాకినీశాకినీభూత లోకములకుఁ
జటులశాతకృపాణియన్ జలజపాణి । పేర్మినాశౌరి రణలక్ష్మిఁ బెండ్లియాడ. 104

వ॥ ఇవ్విధంబున నతిఘోరంబగు యుద్ధరంగంబునఁగుంభినీరమణాకారులైన కుంభినీరమ
ణుల మారి మారింబోలి నిరసించి ద్వారకాభిముఖుండై చనిచని. 105

సీ॥ భానుభాను ప్రతిబంధిశాఖా శిఖోత్కరముచే నధ్వగాంనంతరణము
కరికరాగ్రోద్ధూతకర్పూరతరురజస్తతిచే సురీపలితంకరణము
ఖగవేగవిహగసంక్రాంతాబ్దగళితముక్తాళిచే వనచరాఢ్యంకరణము
శరభార్తసింహగర్జాప్రతిధ్వనులచే గ్రావమహానుభగంకరణము
నై సువిశ్రాంతసంకుమదాభిలిప్త । తతభిదైత్యవవేణు ముక్తాఫలోద్ధ
రంగవల్లికమార్గాభిరామమైన । ఘనతరారణ్యమొక్కటిఁ గనియెశౌరి. 106

ఉ॥ తాళిక యేసినన్ స్వముఖతామరసంబుల కాశశాంకునిన్
బోలిక చేసి హెచ్చు సరిపుచ్చెదరోయని కాని పూనికే
యేలికజింకనైన నొకయేటున నే పడనేయునేర్తు రు
ద్వేలచమత్క్రియాకలన హెచ్చఁ జరించుపుళిందసుందరుల్. 107

కం॥ నవనవమను నెమ్మొనలు । రివరివమను మధ్యములు ద్విరేభశ్రేణుల్
జవజవమను వేణికి మది । రవరవమను మరుఁడు వారిరంగులు గనినన్. 108

సీ॥ చిఱుతనగొడెలాడ విఱుతురు పెళ్ళున గజదంత మొక కేలఁగరముఁబట్టి
రహిఁ గూఁతలిడ బొంగరపుజాలెకై త్రొక్కి పెఱుకుదురు మృగేంద్రభీమసటలు
పంతంబుతోఁ జాకిబానతిర్లకునంచు బెబ్బులితిత్తులురబ్బురముగ

ధృతి నీలకొట్టాసు తెరసుఁ దెస్తురు గుంటగండభేరుండముఁ జెండి తెక్క-
యాపులాటకు ఘనవరాహములఁబట్టి। కొమ్ములటుఁ ద్రుంచి పగులంగ గ్రుద్దివాని
గొప్పము త్తెము లెల్లఁ గై కొందురందుఁ। జెంచుకట్టులసాహసం బెంచఁ దరమె 110

గీ॥ అట్టివిపినంబు కడుచిత్ర మనుచు వెడలి। కమలదళలోచనుఁడంతఁ గతిపయప్ర
యాణముల ద్వారవతిచేర నరుగుదెంచె। సర్వసన్నాహసముదితోత్సాహుఁడగుచు

చ॥ జలనిధి డాఁగియున్న గిరిసంఘముఁజూడఁగవచ్చు వొడిగు
బ్బలిపయి విద్రుమంపులతవారుతమాలమురీతి వజ్రకం
దళములఁ దేరు తేరిపయి తామరసేక్షణుఁ గూడి శౌరి దా
నలరఁగ నప్పురింగలలతాంగులు సంభృతసంభ్రమాత్మలై 112

ఉ॥ ధావన మొప్ప నోర్తు మురదండనుఁ జూడఁ జనంగఁ గొప్పపైఁ
గ్రేవల రాలి చెంగలువ రేకులు తేఁటులఁగూడి యొప్పె నా
త్రోవ ననేకయత్నావతరతుండయి తన్నెద సేయుశౌరిపై
సేవలు పొంటి యల్గినమహీనతిపాటలితాత్ములో యనన్ 113

ఉ॥ ఇందటఁ బెండ్లియాడ నపుడెంతయు డెందము నిండియుండు గో
విందుని కన్నరీతి ముడివీడినకు ర్లొక కేలుఁదమ్మి చే
ముందరికాని యొక్కటఁ బ్రముగ్ధచలత్కుచపాళి నాఁగుచున్
సుందరి యొక్కె నోర్తుహరిఁజూడఁగఁగాంచనసౌధవీధికన్ 114

ఉ॥ కస్తురముప్పతిల్లు సిరిగందమలంది యలంది గందవున్
జిప్పయుఁదాను నేగనొక చేడియపీఠక వేసుకన్ మదిన్
జిప్పలమ్ముంచి యుత్తు యదుసింహముఖేందునిచంద్రికారసం
బొప్పఁగఁ జారుచారునయనోరుచకోరుల కన్నతీరునన్ 115

ఉ॥ సంగటనున్నయూడిగపుఁజేడియ చుట్టిరొయుచంగునాకు పా
ణిం గదియించి నాసపయి నిల్పె నిజాంగుళియోర్తు శార్ఙ్గిన
ర్థిం గను నాగవల్లి శుభదేవత సాక్షి యథార్థమీమహా
మంగళమూర్తి యొక్కఁడు సమస్తజగంబుల కాథ్యుఁడన్నతిన్ 116

చ॥ ఎలమిగఁ జిన్ననాఁడెతను నెత్తుక ముద్దొనరించు వేఁతమాఁ
కలజిగిమోవి చన్నులును గంకుడుగాయలు లక్కఁదొందఁబం
దులుఁగ నొనర్చి యాడినఘనుం డిపు డెంపఁజేసైనఁ బెండ్లియై
పొలుపగు టేమి? యంచు నొకప్రోఢ నగించె సఖీజనంబులన్ 117

గీ॥ శ్రుతిలసత్సునసోత్త శుష్కభూతి । తారకాంశుఁ యగుచు నెంతయువినీల
వేణ్యుపశ్లిష్టకష్టోపవేశకేళి । నంపదే జన నేత్రాళి? యనిమిషతలు 118

వ॥ ఇట్లు పురంబు ప్రవేశించి గతపురంధ్రీలోకాలోకరోలంబకదంబకాగణ్య పణ్యామ
రందసందోహప్రధానకళాధురంధరముఖారవిందుండై మందగమనంబున రాజమార్గం
బునం జని చని. 119

ఉ॥ గౌరవమొప్ప నాత్మజనకప్రథలోఁడఁ జెలంగునానసాం
భోరుహమండలంబునకుఁ బూర్ణశశాంకముఖీప్రయుక్తమౌ
నారతిపేరఁ గల్గినహులుతాళిప్రదక్షిణ మాచరింపఁగా
సారసపత్త్రలోచనుఁడు చయ్యన నాత్మగృహప్రవిష్టుఁడై 120

క॥ పెండిలికోమార్తిలో ముర। ఖండనుఁ డత్యంతవినయకలితాత్మకుఁడై
దండ మిడె వృద్ధబాంధవ। మండలి కెలు వేల్పులకును మహితప్రీతిన్ 121

వ॥ అంత. 122

సీ॥ ఓష్ఠపుటనికుంచనోత్కంచనములచేఁ గండలంబులాకింతగునిసియాడ
మూర్ప్వలబలిమిచే నుబ్బున్ముక్కులనొప్పు బొజ్జలజన్నిదంబులు చలింప
నందంబుగా నుదాత్తానుదాత్తస్వరస్ఫురణంబుచేబొమల్ పుటము లెగయ
శ్రమవారిచేగోపిచందనంబునఁబెట్టుఫాలోర్ధ్వపుండ్రముల్ పదనుగొనఁగ
ఘననిరర్గళగళగళత్కలరవంబు । తూర్యకోటికిమిగుల వాదోడుగాఁగ
గర్గమునిముఖ్యభూసురవర్గ మపుడు । వరుసనొనరించెఁ బుణ్యాహవాచనంబు 124

సీ॥ రాజాలయరిసంహరణసముద్ధతిఁ జూచి సమదసారంగముల్ చాల నొసఁగి
విప్రవరులయనంతప్రచారగుణంబు మది నెంచి బహుతరచ్ఛదము లొసఁగి
కవిసంఘములపదగ్రథనచాతురి మెచ్చి సారసహితములౌ సరము లొసఁగి

సూతుల గాంధర్వరీతిజ్ఞతలు గాంచి డంబుగా ఘనకంచుకంబు లూనఁగి
యఖిలజనులు సుఖీభవయనుచుఁ బొగడ। దానపాండిత్యమహిమలఁ దనరె నప్పుడు
నిజయశఃపుంజమయశంఖనికషణాంచ। దంబరాంబరుఁడైన పీతాంబరుండు.125.

వ. ఇట్లు సకలవైభవంబులఁ గల్యాణ మవధరించి హరిసుఖంబున్న సమయంబున 126.

క. ఇంక ఘనకూపవితతులు। కొంక సరోజాకరములు కుంభిని నదులున్
డొంకఁ బయోనిధు లెంతయు। జంక నిదాఘంబు వచ్చె సరభసవృత్తిన్.127.

సీ. హరియైన పడదాఁకి యట్టిట్టుగాఁడె తా శీల నంబుధిఁ బవ్వళింపఁ డేని
శివుఁడైన దూపిలి చిక్కఁడె జాహ్నవి సెలమితో శిరసావహింపఁ డేని
ధాతయైనను బెట్టు దగచేత నొగలఁడె తమ్మిలో నిమ్ముగా దాఁగఁ డేని
యింద్రుఁడైనను జాల నెదయెండి చెదరఁడే కోడెమబ్బుల నెక్కియాడఁ డేని
యనఁగ నేసవియుండెఁ జండాంశుకిరణ। దళదిలాచక్రరేఖాశతప్రసక్త
రక్తసిక్తాంత తీక్ష్ణదుద్రిక్తరత్న। భోగనిర్యాతపాతాళభోగి యగుచు. 128

చ. వనరుచు దప్పి నొప్పుచెడి వాత నొకింతయు మాటలేమిఁ జే
ననిలుఁ డనంగ నొప్పె వ్యజనాంతనికాంతనితాంతవాసియై
జనఘనఘర్మనిర్మలతుషారకణంబులు గ్రోలి శాలితా
ననయముఁ బొందె గంధవహుఁ డన్నసమాఖ్య మదిన్మదించుటన్. 129

వ. అప్పుడు. 130

సీ. ఘనములై రుచిఘనఘనములై శుకపికావనములౌ నుద్యానవనములందు
తరములై పరిమళోత్తరములై యానందకరములౌ నంబుజాకరములందు
వలములై మణులతావలములై గ్రహలతాంచలములౌ కేళికాచలములందు
ఘనములై మదనబోధనములై యతివినూతనములౌ మణినికేతనములందు
నగ్గలపుసిగ్గు లడఁగంగ నడఁగి పెనఁగి। గొనబుజంకులు దేరంగఁ గూడియాడి
మద్రజకు నొయ్యఁదన మేను మరపి శౌరి। యలరువిలుకాని క్రీడలనలరుచుండె 131

మ. మురజిద్భక్తగిరీంద్రనిర్మథితసంపూర్ణాత్మ మేధాసుధా
సరిదీశోదితభవ్యకల్పజయశఃక్షౌమాంబరాళీనిరం

తరగుప్తావిరతోత్తరీయఘనముద్రద్రావిడీవర్ణితా
తురపాంచాలసుతావనప్రవణ గోధుక్సార్వభౌమోపమా. 132

గద్య. ఇది శ్రీమద్రామానుజ భాగినేయకుల సార్వభౌమశ్రీమన్నల్లనా
చార్యవర్య పరిచర్యాధుర్యచన్నకేశవార్యపుత్రతిరుమలాచార్య
పౌత్రగౌతమగోత్రసింహాద్రి వేంకటనామ ధే
యప్రణీతంబైన లక్షణావివాహంబను
చమత్కారమంజరికిఁ
గోరకాయితంబ
గుతృతీయాశ్వా
సము.

సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

—:(o):—

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 3 | చిత్రమైయొప్పు | చిత్రచైత్రంబు |
| | 16 | యంబారు | యంబాళు. |
| | 17 | నిశాదూరీ | న్నశాధూరీ |
| 2 | 7 | కారణంబునన్ | కాలమందునన్ |
| 3 | 2 | ఘనమెన | ఘనమైన |
| | 5 | ఋనస్సమ్మిళత్రితాపవి | మనస్సమ్మిళత్రితాపిత |
| | 6 | శంకాౖ | శంకా |
| | 15 | కాఁచన | కాంచన |
| | 23 | మహానసను | మహానస్థు |
| 4 | 2 | రయ | డయర |
| | 5 | భిదురభృద్దురవస్థ | భీదురభీదురవస్థ |
| | 10 | క్రమముళాహ్వాత్థేచరా | క్రమముహ్వాత్థేచరా |
| | 23 | రాజుశశంబునుజూచిచూచి | రాజశశంబులఁబారఁజూచి. |
| 5 | 14 | మిూరిసాంజన | నిరస్తాంజన |
| 6 | 9 | నిందనము | నిందకము |
| | 10 | ప్రవాహంబు | ప్రమాణంబు |
| 7 | 4 | మడగిచ్చు | మదుగిచ్చు |
| | 14 | జెలంగునుసరసవన | జెలంగెడినురసవన |
| | 17 | మూరంద | మరంద |
| | | తదాహారిభూరి | సదాహార్యహారి |

| | | | |
|---|---|---|---|
| | 22 | పేశేలు | పేరెముల్ |
| | 28 | ఁదరఁగాఁశేరినచిరినవ్వు | ఁమురుఁగాఁబెరిఁగినచిఱునవ్వు |
| | | మురవైన | ముగువైన |
| 8 | 2 | బాపడ | బాపట |
| | 9 | మెరయింపుచు | మొరయింపుచు |
| | 10 | విరులులో | విగులలో |
| | 16 | నుచితముగాసువర్న | నుచితసువర్ణవర్ణ |
| | 18 | కర్బురాత్రి | కర్బురాప్తి |
| | 20 | మీాపద్వైకసిత | మీాపద్వాహసిత |
| | | దొరంగ | కొలంగ |
| | 24 | గత | తగ |
| | 25 | యున్నత | యుత్సుక |
| | 28 | పోగల | సోఁగుల |
| 9 | 5 | ఖంబులే | నఖంబులె |
| | 9 | లాగమాభ్యాసతి | లాగమాభ్యాసిత |
| | 16 | కన్గవల | కన్గొనల |
| 10 | 1 | పసక్రొమ్మొగ | పసికెమ్మొగడ |
| | 10 | దారకకాంతి | దారకాకాంతి |
| | 13 | నుబిక్కుటిలిన | నం బిక్కుటిలిన |
| | 18 | బోరెడు | బారెడు |
| | 19 | వలిగొను | వలిగొని |
| | 24 | రమణు | రమణ |
| | 25 | యలరులువాత్రైనసిన | యలరులఁబాత్రైనసిన |
| | 29 | వాసనలం | వాసనఁగొను |
| 11 | 1 | జూపియు | జూపిరొ |
| | 8 | మ్మ్రొసవుగాదుకాదిది | మ్మ్రొరుసఁగాదునానది |
| | 10 | సుమభూరి | భూరిసుమ |

| | | | |
|---|---|---|---|
| | 12 | ఁగేరి | రీతి |
| | | యిత్తరి | యత్తఱి |
| | 13 | యొక్కటీ | యొక్కటే |
| | 16 | డలమబాగ | డలరులాగ |
| | 19 | దట్రు | దట్ర |
| | 21 | దుత్కంఠికా | నుత్కలికా |
| | 24 | యొకర్తుమించు | నొకర్తునించె |
| | 28 | వెన్నెల | వెన్నలు |
| 12 | 7 | సరసంపుక | సవరంపుఁగు |
| | 14 | శట్రకేశ్వర | జట్రకేశ్వర |
| | 22 | యదెయిడె | యదియొది |
| | 23 | భిట్టు | బెట్టు |
| | 25 | మపుడుబడిమి | మప్పుడుబడి |
| | 29 | వెులగునేయిట్టిభయమంచు | దొలగునిట్టిభయమ్మంచు |
| 13 | 1 | బట్టెఁబాణి | బట్టు పాణి |
| | 8 | విూద | లెల్ల |
| | 11 | విడచి | బిడిచి |
| | 13 | కేరి | కెంపు |
| | 20 | టసటితే | టసటులు |
| 14 | 13 | కోరకంబుల | కోటరంబుల |
| 15 | 4 | జతల్గూడ | జతల్గూడు |
| | 5 | పూరిగ | పూర్తిగ |
| | 8 | పొందు | ప్రొద్దు |
| | 12 | సంచించి | సంకించి |
| | 13 | ఆడుమాటల | ఏడమాటలు |
| | | గూడదద | బ్రోడల |
| | 14 | బడుచు | నడచు |

| | | | |
|---|---|---|---|
| 15 | 14 | పిక్షించి | సీక్షించి |
| | 16 | జెలరేగి | జెలగిరి |
| | 19 | చేడియకోపము | చేడెకోపమా |
| | | భామా | బారా |
| | 20 | తాళము | తాళుము |
| | 21 | వేడ్కజని | పెక్కిడని |
| | 22 | మైకొని | మైకొను |
| | 23 | మూటల | మూటలు |
| | | పాటపు | చోటను |
| | 24 | దను | నను |
| | 25 | గోరానిన | గంజానన |
| | | చలి | సకి. |
| | 27 | రక్కసి | రక్కస |
| | | మృష | మిష |
| | 28 | రొమ్మడెసన | రొమ్మడినను |
| | | తాపవుటుబ్బకు | దాపంబుబ్బకు |
| | | గెలిచెద | గొల్చెద |
| 16 | 1 | పగిడి | పగటి |
| | 2 | యేలకు | నేలకు |
| | 3 | మొగంబున | మొగంబును |
| | 8 | నొకపట్లమిగులంగనుప్పు | నొరవట్టికొనగదాయొప్పు |
| | 10 | విలయ | వలయ |
| | | పాస్త | పాంథ |
| | 11 | కణాకుమారిలగత్న | కణాత్కుమారిలకాహ్వ |
| | 12 | త్వాల | ఖ్వాల |
| | | తల్పంకేశ | పల్పంకేజ |
| | 18 | ట్పశ్యంచేహ | టశ్య దేహ |

| | | | |
|---|---|---|---|
| 16 | 18 | దుర్ఘట | సద్ఘట |
| | | పద్యాప్త | పదప్రాప్తి |
| 17 | 3 | సర | చర |
| | 4 | తల | తరి |
| | 6 | తానాడంగనందొక్క | తారాడంగశంకించు |
| | 8 | నాస్యములకు | నాబ్జములకు |
| | 9 | బొప్పు | బొప్ప |
| | 10 | కమనీయ | చందనా |
| | | కంబ | కంస |
| | | ఖండ | ఖంత |
| | 13 | సీతా | సితా |
| | 14 | ద్వీప | దీప |
| | 15 | దక్కీ | దక్కి |
| | 18 | తోడ | దోడి |
| 18 | 2 | జయింప | రచింప |
| | | బెద్ద | పేక్ష |
| | 3 | హాత | హిత |
| | | శ్రుతవిపక్ష | శ్రుతివివక్ష |
| | | బయతోఁచి | బయితోఁచ |
| | 4 | దారతాఘన | సారసారఘు |
| | 5 | వా | వ్రా |
| | 7 | ప్పలుకుం | ప్పలుకుల్ |
| | | య | నె |
| | 9 | లాడాడకుఁ | లాడాడనుఁ |
| | 11 | శుభదా | సుభగా |
| | 20 | జెల | జెలుల |
| | 24 | పద్ధత | పద్ధతి |

| | | | |
|---|---|---|---|
| 19 | 2 | డుం డితి | దంటిక్ |
| | 13 | శాలి | శాఖ |
| | 17 | దమ | దగు |
| | 19 | దాల్చె | రాల్చె |
| 20 | 4 | హుం కువేడ్కా | హుఁ కు వేడె |
| | 7 | తత్సహా | తత్సహాజ |
| | 10 | హెన | హీన |
| | 12 | సహా | స్వాహా |
| | 17 | నిరర్ధీకార | నిరంధ్రీకార |
| | 20 | అదియు | అదియొ |
| | 25 | జలంథ | బంధురత |
| | | సూలంబు | శూలంబు |
| | 26 | పది | బది |
| 21 | 5 | నాత | దాత |
| | 8 | నేమి ప్రతియొ | నవిప్రతియొ |
| 22 | 8 | శుఖ | శుక |
| | 11 | ముద్దు | సుద్దు |
| | 19 | గూంచినక్ | చూంచినక్ |
| 23 | 21 | నువ్న | నున్న |
| 24 | 1 | చూడాముమణి | చూడామణి |
| | 18 | బ్రసనాఖ్యం | బ్రసవాఖ్యం |
| | 22 | ఆంత | అంత |
| 25 | 3 | భావ | భావ |
| | 7 | స్చ్ఛభకరాత్రమ | చ్ఛభక్రమ |
| | 9 | వాగూర | వాగ్దూర |
| | 15 | తించి | స్తుతించి |
| | 19 | శమూటచేఁ | మాటచేఁ |

| | | | |
|---|---|---|---|
| 25 | 21 | వలపీ | వల్లపీ |
| 26 | 10 | నెన్నెలన్ | వెన్నెలన్ |
| | 16 | ఘగ | ఖగ |
| 27 | 4 | హాల్ | హాళుల్ |
| | 16 | తెచ్చు | తెచ్చి |
| | | నినారత | నిష్ఠురత |
| | 18 | యోడించుకో | యొడ్డించుకో |
| 28 | 18 | సంబుధినిన్ | సంబుధిన్ |
| 29 | 21 | మ్మృసముఁ | మ్మృసమున |
| 30 | 6 | కందుతే | కద్దువే |
| | 7 | దొక్కటి | జొక్కటి |
| | | దాన | గాన |
| | | ఝూగికిన్ | జోగికిన్ |
| | 19 | పక్షోజ | వక్షోజ |
| | 21 | కాండ్డా | కాండా |
| | | సీకు | సీసు |
| 32 | 4 | నందాహావ | నందావహా |
| | 8 | గుందనవు | గుందనవు |
| | 12 | దర్భ | గర్జ |
| | 16 | మథి | మది |
| 34 | 14 | దప్ప | సువ్వ |
| | 19 | బహిః | బహు |
| | 20 | పుంజముల్ | మంజిమల్ |
| 36 | 5 | వేమరో | లేమరో |
| | 12 | గోకోయన్ | గోకోయన్ |
| | 18 | బూధర | భూధర |
| 37 | 9 | లాన | గ్లాన |

| | | | |
|---|---|---|---|
| 37 | 15 | మానదండ | మారదండ |
| 38 | 7 | యిటమ్మ్ర | యిట్లమ్మ్ర |
| | 10 | నీకనుగాయకే | నీకనుగానకి |
| | 11 | జూప | సైప |
| | 14 | దానికి | ఘాటికి |
| | 22 | చంపకార్గళనూన | చంపకాగమసూన |
| 39 | 4 | శోచిత | శోషిత |
| | 21 | మహా | మహీం |
| | 23 | పదగ | పతక |
| 41 | 4 | రింగువ | రింగస |
| | 9 | దాకున | దారస |
| 42 | 15 | గుమ్మ్ర | గ్రుమ్మ్ర |
| 43 | 28 | గన్నుఁగద | గన్నుఁగవ |
| 45 | 13 | కేరతె | కెరతె |
| | 16 | గృళ్ణుఁ | గృష్ణుఁ |
| 47 | 9 | లతాఁగులు | లతాంగులు |

